# నమో వెంకటేశా.... ♫

24. సంజు
25. తూవనతుంబికళ్
26. ఓకే పిచ్చిమొహమ్
27. సీతమ్మ పెరట్లో జిల్లేడు చెట్టు
28. కిల్లా – మరాఠీ సినిమా
29. గోధి బణ్ణ సాధారణ మైకట్టు
30. శ్రీ(బల)వంతుడు
31. భయానకచిత్రరాజము
32. Mission – Avoidable.
33. గూఢచారి
34. చవట సంగమం.

# చలి యా

*Saturday, 8 April 2017*

సినిమాలు రెండు రకములు. అవి – సాదా సినిమాలు, మణిరత్నం సినిమాలు.

ఫలానా సినిమా మణిరత్నం సినిమా అని చెప్పడానికి కొన్ని లక్షణాలు ఉంటాయి. ఈ సారు వాఁడి సినిమాల్లో – హీరో హీరోవిన్లు చాలా డీప్ గా గొప్ప విషయం చర్చించబోతున్నట్టు మొఖాలు పెట్టి అతి మామూలు విషయాలు మాట్లాడతారు. (ఏ..భయమేస్తుందా? అన్నం పెడతావా? ఈ టైపు) – హీరోవిన్ అతి చిలిపి, అతి ఎమోషనల్, అతి చురుకు. – వేరే సినిమాల్లో మీసం పెట్టుకున్న హీరోలకు మీసం కొరగబడి ఉంటుంది. – హీరో లేదా హీరోవిన్ రోడ్డు మీద నిలబడి అరుస్తా ఉంటారు. "ఏయ్…నేను నిన్ను ప్రేమిస్తున్నా. ఏయ్…నిన్ను ఎత్తుకుపోతా, ఏయ్…నీకోసం మళ్ళీ వస్తా…" ఇలాగ.

ఇట్లాంటి లక్షణాలను సంతరించుకుని, వచ్చిన మరొక సినిమా చెలియా.

వరుణ్ – ఎయిర్ ఫోర్సు లో స్క్వాడ్రన్ లీడర్. లీలా అనే అమ్మాయి డాక్టరు, అతని బాల్య స్నేహితురాలు. వీళ్ళిద్దరూ మణిరత్నం పెట్టిన గైడ్ లైన్స్ ప్రకారం ప్రేమించుకుంటూ, మధ్య మధ్యలో కొట్టుకుంటూ, పాడుకుంటూ,చిలిపిగా నవ్వుకుంటూ, ప్రేమగా అరుచుకుంటూ, కాలం గడుపుతా ఉంటారు.

హీరో హీరోవిన్లిద్దరికీ ప్రేమ అంటే క్లారిటీ ఉండదు. (దర్శకుడికీ ఉండదు) ఓ దుర్ముహూర్తాన రిజిస్టర్ మారేజీ చేసుకుందామనుకుంటారు. అంతలో వరుణ్ పాకిస్తాన్ వాళ్ళకు పట్టుబడిపోతాడు. వాళ్ళు ఇతణ్ణి కొత్త అల్లుడిలా పెషావర్ జైల్లో

పెట్టి ఆదరంగా చూసుకుంటూ ఉంటారు. అక్కడ రెండేళ్ళు ఉండిన వరుణ్, పారిపోయి ఆఫ్ఘన్ బార్డరు దాటి ఇండియాకు తిరిగి వచ్చి తన కోసం వేచి ఉన్న చెలియను కలుసుకుంటాడు. ఇదీ కథ.

ప్రేమ సీన్ల కోసం మణిరత్నం పాతికేండ్ల క్రిందటి గీతాంజలి సినిమా టెంప్లేట్ ను కారక్టర్స్ రివర్సు చేసి వాడాడు. గీతాంజలిలో హీరో దీనంగా ఉంటాడు, హీరోవిన్ చిలిపి, అరుపులు. ఈ సినిమాలో హీరో అరుస్తా ఉంటాడు. హీరోవిన్ దీనంగా ఉంటుంది.

ఇక పాకిస్తాను దృశ్యాలలో ఫోటోగ్రఫీ, లొకేషన్స్ బావున్నాయి. బాక్ గ్రవుండ్ స్కోర్ రహమాన్ కిర్రెక్కిస్తాడు. చివర్లో పాకిస్తాన్ చెక్ పోస్ట్ దగ్గర టిప్పర్ లారీ నడుపుతూ పాకిస్తాను జెండా కూల్చి వచ్చే సీను అదుర్స్. "హంసరో..." అనే పాట, చిత్రీకరణ బావున్నాయి.

హీరోవిను "స్త్రీభావ రామచరణ్ తేజ" లా ఉంది. అన్నింటికీ ఒకే ఎక్స్ ప్రెషను. అయితే అందంగా ఉండడంతో ప్రేక్షకులను పెద్దగా బాధపెట్టదు. ఎయిర్ ఫోర్స్ ఆఫీసు దృశ్యాలు (నాకు) బావున్నాయి. :) హీరో వాళ్ళ నాన్న "చలం అభిమాని" అని చెప్పించారు ఓ సీనులో. చలం అభిమాని అంటే బలహీనుల పక్షాన నిలవడం, బాధపడ్డం లాంటివి కావు. తన కొడుక్కి, కొడుకు తాలూకు (గర్భవతి అయిన) గర్ల్ ఫ్రెండ్ కి విశాల భావాలతో పెళ్ళి చేయడం అన్నమాట. పెళ్ళి పీటల్లో కూడా గర్భవతి కూర్చుంటుంది.

చాలా రోజులు ముఖం వాచి ఉన్న నాకు ఈ సినిమా నచ్చింది. నచ్చింది అనడం కన్నా, పెద్దగా తలనొప్పి తెప్పించి బాధపెట్టలేదు అనడం కరెక్టు. అందుకు నా ప్రయత్నమూ ఉంది. మధ్యమధ్యలో ఫ్రెంచ్ ఫ్రైసు, వేడి కాఫీ, చల్లటి శీతల పానీయం వగైరాలను సినిమా టికెట్టుకంటే ఎక్కువ డబ్బులు పెట్టి బుర్రను కాపాడుకుంటూ వచ్చాను. ఆ ప్రయత్నం ఫలించింది.

చూడాలనుకునే వాళ్ళు హీరోవిను ఆశలు పెట్టుకుని చూడవచ్చు. ఫ్యూచర్ లో టీవీల్లో ఆగస్టు 15, రిపబ్లిక్ డే లకు ఈ సినిమా కంటిన్యూవస్ గా అటెండెన్స్ వేసుకుంటుంది. సందేహం లేదు.

<u>లై.</u>

*Sunday, 13 August 2017*

సినిమా చూస్తే తలనొప్పి రావాల ఎవరికైనా. కానీ ఈ సినిమాకు చెవి నొప్పి. సైన్మా నడుస్తూ వున్నంత సేపూ చెవిలో పూలు పెడుతూ పోయాడు దర్శకుడు.

కథ :– ఒక మాఫియా వాడుంటాడు. వాడికి ఒక సూటు అంటే పిచ్చి. ఆ సూటుకు డ్రెస్ మెటీరియలు డెన్మార్కులో నుండొచ్చి చార్మినారు గల్లీలో కుట్టబడుతుంది. CBI వాళ్ళు దాన్ని ట్రేస్ చేసి విలన్ ను పట్టాలనుకుంటారు. కానీ దాన్ని హీరో దొంగిలిస్తాడు.

ఒంట్రబెల్ తర్వాత కథ లాస్ వేగాస్ కు షిఫ్టు అవుతుంది. పైసా పనిలేని హీరోవిన్ హీరోతో అమెరికాకు పోతుంది. వారి ప్రేమ. కోటు కోసం విలన్ వెంపర్లాట. చివరికి హీరో విలన్ పై ప్రతీకారం తీర్చుకుంటాడు.

మొత్తంగా కథ Poorman's Jamesbond యవ్వారం లాగుంటుంది. ప్రేక్షకుల emotions ప్రమేయం లేకుండా తెర మీద ఏదో నడుస్తుంటుంది. పాటలకు బయటకెళ్ళాలి. అలా సమోసా ఖర్చును సర్ ఛార్జిగా విధించారు.

హీరోయిన్ అందంగా, మందంగా వుంది. విలన్ గా అర్జున్ బావున్నాడు. హీరోను దూరం నుంచి గన్నుతో కాల్చి తప్పించుకొనేలా చేయడం, దగ్గిర నుండి ఫైటు చేసి తన్నులు తినడం, తన వాళ్ళకు తినిపించడం, ఇలా హీరో కు ఒద్దికగా సహకరిస్తాడు. నితిన్ – సిట్ వాళ్ళ దెబ్బకో ఏమో గెడ్డం పెంచాడు. ఫైట్లు పర్లేదు.

చానా రోజుల తర్వాత మణిశర్మకు మంచి బేరం తగిలింది. తన ఫ్రస్ట్రేషన్ ను డ్రమ్ము మీద చూయించాడతను. విలన్ పక్కన వుండే నాజర్ – విలన్ బాగా కరుడు గట్టిన వ్యక్తి అని తెలిసి కూడా ఆ కోటు ఎందుకు? అని అడ్డక్వశన్లు వేసి తలమీదకు తెచ్చుకుంటాడు. ప్రేక్షకులకే లేని తాపత్రయం ఆయనకెందుకో? చివరన ఆ కోటు రహస్యం చెప్పం మక్కిపోయాడు డైరెక్ట్రు. మన ప్రాప్తం అంతే. ఇంట్లో పెళ్ళాంతో కొట్లాడి వుండుంటే ఈ సినిమా మంచి రిలాక్సేషను.

## మురుగులో సాలీడు.

సినిమాలు చూచుటయందే నీకధికారము కలదు కానీ దాని బాగుపై లేదు. వాటి బాగు కు నీవు కారణము కారాదు. అట్లని సినిమా చూచుట మానరాదు. ఆ ఖర్మాచరణకు ఫలితమే ఈ రివ్యూ.

★★★★★★

జనాలను థియేటరుకు లాక్కురావాలంటే వూరికే బాగుంటే సరిపోదు. షాక్ వాల్యూ కావాల. హీరో ప్రతీకారం తీర్చుకుంటే చాలదు. గేదెలా అరవాల. పంట పొలాలు చూయిస్తే లాభం లేదు. తెలంగాణ యాస డిసైడ్ జేయాలె. యాక్షన్ సినిమా చాలదు, సందేశముండాల. థ్రిల్ సరిపోదు. జుగుప్స జోడించాల.

ఈ ఫార్ములా తో పిజ్జా, తైరువడ, ఊసి(పాచి)పోయిన అవియలు కలిపి,పిసికి పైశాచికంగా జనాలకు పిండం పెట్టాడు మురుగ. (MurugaDoss) ఇదొక పిసికోథ్రిల్లర్. సినిమాను తెలుగు జనాలకు నచ్చినట్టు తీయాలా, తమిళ జనాలకు నచ్చినట్టు తీయాలా క్లారిటీ లేని ఫ్రస్ట్రేషన్ ఫలితమిది.

వూరు బైట పెద్ద బిల్డింగులో,cbi లో హీరో పని. ఒక సాఫ్టువేరు తనే రాసుకుని దాన్ని వాడతా వుంటాడు. ఆ సాఫ్టువేరు – ఒంటరి మహిళల ఫోను కాల్సును ట్రాప్ చేసి హీరోకి వినిపిస్తుంది. వాళ్ళ fb, twitter అకవుంట్సు ను చూపిస్తుంది. ఇలా ఫోను కాల్సును శ్రవణానందకరంగా విని, వారికి హెల్ప్ చేస్తుంటాడు హీరో. జీతం 40k నే అయినా జాబ్ సాటిస్ఫాక్షను కోసం ఇలాంటి పని చేస్తాడతను.

ఓ రోజు ఓ ఫోను కాలు విని ఓ అమ్మాయిని రక్షించాలనుకుంటాడు, కానీ రక్షించలేకపోతాడు. ఆ హత్య వెనకాల సీరియల్ కిల్లరు వుంటాడు. వాడెవడు? అదే ఈ సినిమా. శ్మశాన నేపథ్యం, గృహిణులు గోడలు ఎక్కుతా, దూకుతా స్పై పనులు చేయటం, ఏడుపులు, ఇలా తమిళ అభిరుచి ఫ్రేము ఫ్రేములో కనిపిస్తుంది. హీరోయిన్ హీరో లవ్ ఎపిసోడ్స్, హీరో అమ్మగారి చెణుకులు ఇవన్నీ పాచిపోయిన పిండానికి ఆముదపు తిరుగుమోత లా వుంటయి. హీరో గుణగణ వర్ణనతో సాగిన మొదటి పాట లో డ్రిల్లు బావుంది.హీరో యూనిఫారం బట్టలు టైలర్ సరిగ్గా కుట్టలేదు. బాగా tight అయ్యాయి. మిగతా పాటలకూ ప్రేక్షకులకూ సంబంధం వుండదు. వాటి మానాన అవి వచ్చిపోతాయి. విలను భైరవుడిగా సూర్య అసహ్యాన్ని పండించాడు. పాలలో ఫినాయిలు లాంటి హారిస్ జయరాజ్ ఈ సినిమా మ్యూజిక్ ను చెరపట్టి ప్రేక్షకుల క్షోభకు కారణమయ్యాడు.

కెమెరా తప్పదు కాబట్టి వుంది. గ్రాఫిక్సు బండరాయి ప్రహసనం చిల్లర వ్యవహారం లా వుంటుంది. వందలకొద్దీ జనాలు సచ్చినా హీరోను అందరూ పొగుడుతారు. ఎందుకో అర్థంకాదు. చివర ఫైటు ముందే బయటికి వచ్చేయచ్చు.

తమిళడైరెక్టర్ల నుంచి ఇకపై వచ్చే సినిమాలకోసం ఓ నాలుగు రోజులు ఆగడం ఆరోగ్యానికి మంచిది. ఇది మెసేజ్.

## చెవిటిరాగం – మసిరత్నం.

*13 Dec 2018, 15:51*

"నమో వెంకటేశా, నమో తిరుమలేశా.."

పాటతో సినిమా మొదలయింది.

"సినిమా మొదలయిందా లేదా? స్కిరీను అంతా నల్లగా ఉండాది?" – ఓ పల్లెటూరాయప్ప తిట్టబట్టినాడు.

"ఇది మసిరత్నం సినిమా పెద్దాయనా, కొంచెం సేపు అట్లానే ఉంటాది. ఆ తరవాత కనులు అడ్జస్ట్ అవుతాయి." – పక్క సీటు కాలేజీ పిల్లోడు చెప్పె.

నల్ల స్క్రీను మీద ఒక మూల చిన్నగా పొగ.

తెర అంటుకోనిందా?

లేదు.

మూలకు హీరో నిలబడి, తుంటబీడీ తాగుతా ఉన్నాడు. క్రమంగా వాడి జిడ్డు ముఖం కనబడింది. వాని జుట్టుకి బాగా ఆముదం పట్టించి, క్రాపు వెనక్కి దువ్వినారు.

<u>చెవిటిరాగం.</u>

ఇంద్రశేఖర్ – భైరవిని కొన్ని తప్పనిసరి పరిస్థితుల్లో పెండ్లి చేసుకున్నాడు. పెండ్లి చేసుకున్న రెండు రోజుల్లోనే వెడ్డింగు గిఫ్టు కింద భైరవి విడాకులు అడిగింది.

ఏం? అంత కన్ఫ్యూజన్ ఎందుకు? భైరవి ఏమన్నా ఫెమినిస్టా?

కాదు. ఇలా అడగటానికి ఆమె ఫ్లాష్ బాక్ కారణం.

పెండ్లి కాక ముందర భైరవి పరమ భయంకరంగా చిలిపి. ఆమె పైశాచికత్వానికి కొన్ని నిదర్శనాలు ఉన్నాయి.

- శుభ్రంగా నిద్రపోతుండే ముసలి అవ్వ చెవిలో కట్టిపుల్ల దూర్చటం;
- చెరువులో దిగి బాతులని చెదరగొట్టటం;
- చపాతీపిండితో మీసాలు పెట్టటం;

- చిన్న పిల్లలను వెంటేస్కుని మేకలు తోలడం;
- చిల్లాకట్టె ఆడటం; వర్షంలో దున్నపోతులాగా ఎగరటం;
- ఊరూర్కే నవ్వటం; ఊరూర్కే అరవటం;

వగైరా. ఈ చిలిపి తనపు భైరవి కాలేజీలో "నిశాచర్" అనే యువకునితో ప్రేమలో పడింది. ఈమెకున్న పైత్యాల్లో కొన్ని వాడికీ ఉండటంతో ఇద్దరూ సెట్ అయినారు. అంతా అయి కరెక్టు పెళ్ళి చేసుకునే టైముకు వాడు అడ్రెస్ లేకుండా పోయినాడు.

ఫ్లాష్ బాక్ విన్న ఇంద్రశేఖర్కు కడుపులో దేవింది. ఏంటిది?ఆమె ఎవణ్నో ప్రేమించింది. వాడిప్పుడు లేడు. లేడు కాబట్టి ఆల్టర్నేట్ చేసుకొని అడ్జస్ట్ అయి సావచ్చు కదా?

అతనికి మెల్లమెల్లగా అర్థం అయింది. ఈజీగా సమస్య సాల్వ్ అయిపోతే భైరవి(లాంటి వారి)కి తృప్తి ఉండదు. అలా సాల్వ్ చేసేస్తే, ఇక తన ఇంపార్టెన్స్ ఏముంది? సమస్య బయటకు చెప్పకుండా, లేకపోతే ఏడ్చుకుంటూ, అలుగుతా దాన్ని నానబెట్టి, అది కుళ్ళి, కంపు కొట్టే పరిస్థితి వచ్చినప్పుడు, ఆ ప్రాబ్లెమ్ ని సాల్వ్ చెయ్యలేక ఎదుటోడు అవస్థ పడుతుంటే, అందులో ఉండేది నిజమైన మజా!

చెవిటి దాని ముందు శంఖం ఊదటం వేస్ట్.

గత్యంతరం లేని పరిస్థితుల్లో ఇంద్రశేఖర్ – ఈ సిచువేషన్ ను ఇన్ డైరెక్ట్ గా ఎదుర్కొంటాడు. మెంటల్ టార్చర్ కన్నా ఫిజికల్ టార్చర్ మేలు.

ఇంద్రశేఖర్ కంపనీ లో యూనియన్ లీడర్ ను సస్పెండ్ చేస్తాడు. వాడు వచ్చి తన ను ఛావగొట్టడంతో ఇంద్రశేఖర్ ఆస్పత్రి లో పడతాడు. అలా ఆస్పత్రిలో మూలిగే ఇంద్రశేఖర్ కు భైరవి భైరవి సపర్యలు చేసి మళ్ళీ మామూలు మనిషిని చేసి, మొగుడుగా ఒప్పుకుంటుంది. (ఇంద్రశేఖర్ పథకం అలా పారింది)

ఈ చెవిటి రాగం సినిమాకు వర్షన్స్ వున్నాయి. అందులో హిందీలో "హమ్ మూత్రపిండోం కో దేచుకే సనమ్" ఒకటి. అన్నీ వర్షన్లూ హిట్లే.

## నీ కిడ్నీనే ప్రేమిస్తా

*27 Nov 2018, 11:25*

శానా కాలం ముందర అదేదో తమిళ డబ్బింగు సినిమా. "నిన్నే ప్రేమిస్తా"అనుకుంటా. హీరోయిన్ – హీరో కండ్లనే మాత్రమే ప్రేమిస్తాది. ఆ సినిమాకు నూతన రూపం యిది.

పార్ట్ – 2 నిన్నే ప్రేమిస్తాన్ = నీ కిడ్నీనే ప్రేమిస్తా / మనసు మూత్రపిండం

కల్యాణ్ ఒక సాఫ్ట్ వేర్ ఇంజినీరు. వాడికి క్షత్రియపురానికి ట్రాన్స్ ఫర్ అవుతుంది. ఆ ఊరికి పోతాఉంటే, లెగ్గు ప్రభావంతో, బస్సుకు ఏక్సిడెంట్ అవుతాది. ఏక్సిడెంట్ లో అతని కిడ్నీకి డామేజ్ అయితే, వేరే కిడ్నీని తెచ్చి అంటిస్తారు. ఆ తరవాత మూడు నెలలకు – వాడు క్షత్రియపురానికి పోతాడు, కోడింగు తప్ప మరో యోగ్యత లేని కల్యాణ్.

ఆ ఊర్లో ఓ కొంపలో, ఫ్రెండుతో సహా దిగుతాడు కల్యాణ్. ఆఫీసుకు పోయి రాత్రి ఇంటికొచ్చే సరికి ఇల్లంతా సర్ది ఉంటుంది. తర్వాత రోజు ఎదురింటి అమ్మాయి రత్నబాల వీడికి చిక్కుడుకాయ కూర తెచ్చిస్తుంది.

తర్వాత రోజు చిక్కుడు కాయ చట్నీ.

తర్వాత రోజు చిక్కుడు పప్పు

తర్వాత చిక్కుడు సాంబారు.

తర్వాత చిక్కుడు – పూతరేకులు.

కల్యాణ్ కి పృష్టము దగ్ధమయ్యింది.

"ఏంటండి యిది ? నిన్న సాంబార్లో కారం ఎక్కువ. మొన్న పప్పులో ఉప్పు లేదు. అంతముందు కూర ఉడకలేదు. చట్నీ – పతంజలి టూత్ పేస్టులాగుంది. – ఎందుకిలా హింసిస్తున్నారు? ఇప్పుడు ఏకంగా చిక్కుడుపూతరేకులు తెచ్చిపెట్టారు. బ్రహ్మచారి వంటకన్నా ఘోరంగా ఉంది. ఎందుకిలాగ?" అడిగాడు ఆమెను అతడు ఆవేదనగా.

"చిక్కుడు కాయలు కిడ్నీ షేపు లో ఉంటాయండి. కిడ్నీలకి చలవ. అందుకే"

"అలా అని మంతెన్ సూర్యనారాయణదాసు చెప్పినాడా?" పళ్ళు పటపటకొరికాడు కల్యాణ్.

"అవును. వాడి వీడియోలు ఫార్వర్డ్ చెయ్యమంటారా?"

"ఒద్దులే. దానిబదులు ఈ చిక్కుడు పూతరేకులే నయం." – పూతరేకులు నోటబెట్టుకున్న కల్యాణ్ ఒక్క పీస్ కూడా తినలేకపోయాడు. "మీ వంట – పరమ దారుణంగా ఉంది."

నిజాలు చెప్పేసరికి రత్నబాల ఐసు నుండి వాటర్ జలజలా కారాయ్. "నేను మీ కిడ్నీలని మనసారా ప్రేమించానండి" అని ఏడుస్తొ వెళ్ళిపోయింది.

కల్యాణ్ కిడ్నీ కరిగింది. నిజానికి తనూ మరీ మొదటిచూపులో కాకుండా, మూడునాలుగు చూపుల్లో ఆమెను ప్రేమించాడు. ఆమె వంట – ఆలోచించాల్సిన అంశమే అయినా తన ముష్టి సాఫ్ట్ వేర్ జీవితానికి అంతకన్నా గొప్ప అమ్మాయి దొరకదు. కల్యాణ్ వాళ్ల ఊరికెళ్ళి అమ్మా నాన్నతో, రత్నబాల సంగతి చెప్పి వారిని క్షత్రియపురానికి తోలుకొచ్చాడు.

తీరా అంతా సరిపోయే టైముకు రత్నబాల అన్నాది – "నేను ప్రేమించింది మీ కిడ్నీలనే కాని,, హోల్ సేల్ గా మిమ్మల్ని కాదు. ఈ ముష్టికి కారణం నా ఫ్లాష్ బ్యాక్."

"ఆ ఫ్లాష్ బ్యాక్ ఏదో ఏడవండి."

రత్నబాల ఫ్లాష్ బ్యాక్ చెప్పింది. ఆమె అంతకు ముందు శ్రీనివాసులు అనే వాణ్ణి ప్రేమించింది. కానీ వాడు సచ్చాడు. వాని కిడ్నీలు బ్రతికాయ్. అవే కల్యాణ్ కు అమర్చారు. అందుకే ఈ కిడ్నీప్రేమ.

కల్యాణ్ – ఆ ఫ్లాష్ బ్యాక్ విని భళ్ళున వాంతి చేసుకున్నాడు. ఆమె ఫ్లాష్ బ్యాక్ ఆమె వంటకన్నా దారుణం – అనుకున్నాడతను. ఆపైన తేరుకున్నాడు.

"సరే రత్నబాలా, నువ్వు కిడ్నీలనే ప్రేమించు. కానీ కిడ్నీలకు స్వతంత్ర అస్తిత్వం లేదు. వేరే వాటితో కలిసి ఉండాల్సిందే. కాబట్టి నన్ను పెండ్లి చేస్కో."

రత్నబాల ఆ లాజిక్ కు ఒప్పుకోలేదు. "అదెట్లా? నీలో కిడ్నీలు మాత్రమే శ్రీనివాసులు వి. మిగతా బాడీ నీది. నేను ప్రేమించింది – శ్రీనివాసులు కు చెందిన కిడ్నీని."

"ఆ కిడ్నీలని బ్రతికించడానికి నా శరీరంలో మిగతా పార్టులు శాయశక్తులా కృషి చేస్తున్నాయ్." – కల్యాణ్.

"లేదు. నీ శరీరంలో మిగతాపార్టులన్నిటీ నా శ్రీనివాసులు కిడ్నీ కాపాడుతోంది."

ఇది తను రాసే సాఫ్ట్ వేర్ లో కన్నా కాంప్లికేటెడ్ లాజిక్. కుదరక కుదరక ఓ అమ్మాయి దొరికితే, ఆ అమ్మాయి కథ యిది. ఇతని బాధ చూడలేక రత్నబాల మరొక సంబంధం కుదుర్చబోతే, ఆ అమ్మాయి – కల్యాణ్ గురించి విని ఇతణ్ణి చేసుకోవడానికి ఒప్పుకోదు. కల్యాణ్ ఫ్రెండ్ రమేష్ ను ఆమె వివాహమాడుతుంది.

చేసేది లేక కల్యాణ్ అలా ఉండిపోతాడు. రత్నబాల కూడా తన పవిత్రమైన కిడ్నీ ప్రేమను కంటిన్యూ చేస్తూ జీవితాన్ని గడుపుతుంది.

శుభం.

## గ్రీష్మకాకి

*22 Nov 2018, 12:11*

"వసంతకోకిల" సెకండ్ పార్ట్ – "గ్రీష్మకాకి".

కమల హాసన్, శ్రీదేవిల వసంతకోకిల (తమిళంలో మూన్ఱాం పిరై) కి రెండవ భాగం తీస్తే ఇట్లా ఉంటాది.

మొదటి భాగం చివర్లో శ్రీదేవి కమల్ ను వదిలేసి పోతుంది.

శ్రీదేవి వదిలేసిందన్న బాధ ఎక్కువై కమల్ కు మెంటలెక్కుతుంది. దాంతో అతని మెంటల్ ఏజ్ ఐదేళ్ళ పిల్లవాడిగా అయిపోతుంది. వాడు రైల్వే స్టేషన్ లలో "విజ్జీ", "విజ్జీ" అనుకుంటూ, మర్కటావతారం ఎత్తి గెంతుతూ తిరుగుతూ ఉంటాడు. ఇలా సౌత్ సెంట్రల్ రైల్వేలో స్టేషన్ లను ఒక్కొక్కటిగా కవర్ చేస్తూ చెన్నై కొస్తాడు.

అతణ్ణి – సాఫ్ట్ వేర్ డెవలపర్ గా ఉన్న శ్రీదేవి రక్షిస్తుంది. ఇంటికి తెచ్చి సంఘంలో వ్యతిరేకతలను పట్టించుకోకుండా సాకుతుంది. శ్రీదేవికి ఆల్రెడీ ఎంగేజ్మెంట్ అయి ఉంటుంది. కానీ పసిపిల్లవాడి మనస్తత్వం ఉన్న కమల్ ను ఇంటికి తోడుకురావడంతో ఆ సంబంధం కేన్సిల్ అవుతుంది.

శ్రీదేవి, కమల్ – వీళ్ళ మధ్య చిన్న చిన్న అనుబంధాలు. ఓ మారు కమల్ కు అన్నం తినిపించాలని కోతిని అనుకరిస్తుంది శ్రీదేవి. అలాగే వాడికోసం ఓ కుక్కపిల్లను తెచ్చిస్తుంది. అలాగే రైలుపట్టాలపైన రైలు శబ్దం వినడం వగైరా వగైరా. ఇలా ఎన్నో మధురమైన అనుభూతులు.

మరో మారు – శ్రీదేవి ఆఫీసుకు పోయి ఉంటుంది. ఆ టైములో కమల్ కు మళ్ళీ మెంటల్ ఎగదన్ని, తన బంధనాలు తెంపుకుని, తన విశాలప్రపంచమైన రైల్వే స్టేషన్ కు పారిపోతాడు. ఎలాగో ఈ వార్త విన్న శ్రీదేవి, డెవెలప్ చేస్తున్న "జావా" ప్రోగ్రామును ఆపేసి, రైల్వే స్టేషన్ కు పరిగెత్తి వాణ్ణి లాక్కుని ఇంటికి వస్తుంది.

ఓ మారు అదేదో పండుగ. ఆ పండక్కు కొత్త బట్టలు అమెజాన్ ప్రైము లో ఆర్డరిస్తుంది శ్రీదేవి. ఆ కొత్తబట్టలను స్వయానా తనే కమల్ కు తొడుగుతుంది కూడా. అంతే కాదు పుట్టకోసి కట్టడంలోనూ ట్రైనింగ్ ఇస్తుంది. ఇట్లాంటి పనుల వల్ల క్రమంగా కమల్ కోలుకుంటూ ఉంటాడు.

ఓ ఫేస్ బుక్ అకవుంట్ కూడా క్రియేట్ చేస్తాడు కమల్. ఆ ఫేస్ బుక్ లో అరగంటకొకమారు ప్రొఫైల్ ఫోటోలు మారుస్తూ ఉంటాడు. దాంతో అతడి అపరిమిత జ్ఞానానికి ఆశ్చర్యచకితులైన ఫేస్ బుక్ మేధావులందరూ అతణ్ణి ఫాలో అవుతుంటా ఉంటారు. వాళ్ళ సంఖ్య వేలల్లో ఉంటుంది.

ఆ మేధావుల్లో ఒకడు ఇదివరకు కమల్ హాసన్ కు ఫ్రెండు అయుంటాడు. వాడు పాత (మెంటల్ లేని) కమల్ ను గుర్తించి, అతణ్ణి వెతుక్కుంటూ వెళ్ళి, అతడిని చేరుకు హాస్పిటల్ కు తోలుకుపోయి, మెంటల్ పూర్తిగా మానిపిస్తాడు.

ఇప్పుడు కమల్ కొత్త వాడు. అతని తలలోని హార్డ్ డిస్క్ లో పాత జీవితం అంతా ఫార్మాట్ అయిపోయింది.ఇలా కమల్ కు మెంటల్ సరి అయిపోతుంది.

అతను గతాన్ని మర్చిపోయి వాళ్ళ ఊరికి వెళ్ళిపోతూ ఉంటుంటాడు. అప్పుడు శ్రీదేవి అతికష్టం మీద, దేక్కుంటూ రైల్వే స్టేషన్ కు వచ్చి, అతను ఎక్కి ఉన్న రైలు కిటికీ పక్కన నిలబడి అతనికి, తనకూ ఉన్న అనుబంధాన్ని గుర్తు చేయడానికి రకరకాల సంజ్ఞలు చేస్తుంది. కోతిని, కుక్కను అనుకరిస్తుంది. కమల్ కు ఆమె చేసేదేదీ అర్థం కాదు. రైలు వెళ్ళిపోతుంది.శ్రీదేవి బాధగా వెనక్కి మరలుతుండగా – తెరపైన "గ్రీష్మకాకి" అన్న టైటిల్ పడుతుంది.

కమల్ ను కమల్ గా పెట్టేసి, శ్రీదేవి బదులు కొత్తవాళ్ళనెవర్నైనా తీసుకోవచ్చు.

*గ్రీష్మకాకి;*

*నిదాఘవాయసము;*

*ఎండాకాలపు పిండభుక్;*

*ఒక లఘుపతనకుడి కథ;*

ఈ టైటిల్స్ ను పరిశీలిస్తున్నారు. తమిళంలో – "నాలావదు పీరై" అంటే సరిపోతుంది.

# గ్రీష్మకాకి – ScreenPlay

లఘుపతనకుడి కథ

రైల్వే స్టేషన్ ప్రేమ

మండువేసవిలో ఎండుకాకి

దీంట్లో కొన్ని సీన్లు.

1. ఐదేండ్ల మనస్తత్వం ఉన్న కమల్ ను శ్రీదేవి ఇంటికి తోడుకుని వచ్చింది . బొమ్మలు కొనిచ్చింది. ఇంట్లో కమల్ రచ్చ లేపుతుంటాడు. భోంచెయ్యాలంటే శ్రీదేవి కథ చెప్పాల్సిందే. అన్నం ముద్దలు కలపాల్సిందే. "రైలు కూత" వినాల్సిందే. కమల్ మైండు చిన్నది, బాడీ పెద్దది అవడంతో బొమ్మలు ఇంట్లో సామాన్లు అన్నీ విరిగిపోతుంటాయి. వచ్చిన రోజే టీవీని బొమ్మనుకొని పగల నూకుతాడు బాలకమల్.
2. రెండ్రోజులకు శ్రీదేవి పెండ్లి చూపులు. పెద్దల బలవంతం మీదనే ఆమె దీనికి ఒప్పుకుంటుంది. ఆ తర్వాత ఎలానూ నచ్చలేదని చెప్పేస్తుంది. పెండ్లి చూపుల్లో బాబు ఏం రచ్చలేపుతాడో అని వాణ్ణి లోపల రూంలో కట్టి పడేస్తారు. అయినా పెండ్లి చూపులు టైం కి వీడు కట్లు తెంపుకుని, బనీను, నిక్కరుతోటి ఈ గది లోకొస్తాడు. సరిగ్గా ఆ టైంలో చూపులకొచ్చిన వాళ్ళకు లడ్డూలు, స్వీట్లు పెడుతుంటుంది శ్రీదేవి. తనకు పెట్టకుండా ఎవడికో లడ్డు పెట్టేది చూసి బాలకమల్ కాళ్ళు ఆడిస్తూ మొండికేస్తాడు. వాడి లడ్డూని కొట్టి లాక్కుంటాడు. అడ్డొచ్చిన యువకుడి తండ్రికీ రెండు వడ్డిస్తాడు.

   వాళ్ళకేమీ అర్థం కాదు. భయపడి వాళ్ళు పారిపోతారు. తన పెళ్ళి చూపులు భగ్నమైనందుకు శ్రీదేవి కమల్ ని మెచ్చుకుంటుంది. బుగ్గలు పుణుకుతుంది.

3. దీపావళి పండగ. పటాకుల శబ్దానికి కమల్ భయపడి ఏడ్పు లంకిస్తాడు. అప్పుడు శ్రీదేవి దీపావళి, పొల్యూషన్, సుప్రీం కోర్ట్ టైం అన్న అంశాలపై ప్రసంగించి పక్కింటోల్లకు కనువిప్పు కలిగిస్తాది.
4. మెంటల్ పేషెంట్ కమల్ ఫేస్బుక్ అకవుంట్. "ఆస్పత్రికి పోయేముందు" – లాలీపాప్ తో సెల్ఫీ. "ఆస్పత్రి తర్వాత" – పాపిన్స్ తో సెల్ఫీ. వీడు డాక్టరేమో, చెప్పేది ఆరోగ్య సూత్రాలేమో అని అనుకుని లైకులు, లవ్వులూ, ఓహ్ లూ. వేలల్లో.

5. చివరి సీన్లో శ్రీదేవి దేక్కుంటూ స్టేషన్ కొచ్చి, వీడి కిటికీ కాడ నిలబడి నానా రకాల "డెమో" లిస్తుంది. అవేవీ పనిచెయ్యవు. కడాకు లడ్డు తెస్తుంది యాద్నుంచో. కిటికీ గుండా విసురుతుంది. కమల్ ఆ లడ్డూ రైల్లో బిచ్చగాడికి ఇచ్చేస్తాడు. శ్రీదేవి కన్నీరు మున్నీరవుతుంది.

## మొహల్లా అస్సీ

*17 Nov 2018, 21:22*

సాహిత్య అకాడెమీ పురస్కార గృహీత కాశీనాథ్ సింహ్ వ్రాసిన 'కాశీ కా అస్సీ' – లో ఒక వ్యాసానికి, ఇతర వ్యాసాలకు జతకలిపి కూర్చిన సినిమా రూపం యిది. కాశీనాథ్ పుస్తకం – ఆత్మకథా, వ్యాసాలా, కథలా, మ్యూజింగ్సా అని ఇతమిత్థంగా చెప్పజాలనిది. అన్నిటి సమాహారం. ఇది 90 ల నాటి కాశీ నగర జీవితాన్ని, మారుతున్న సాంస్కృతిక విలువలను గురించిన పుస్తకం. ఇదే సినిమాలో కథ కూడా.

కాశీ లోని అస్సీ ఘాట్ – ఆధునిక కాశీ నగరానికి మీనియేచర్ రూపం. కాశీకే కాదు, భారతదేశానికి కూడా. ఇక్కడ పలు ప్రాంతాల నుంచి వచ్చి స్థిరపడిన వారుంటారు. పప్పు చాయ్ దుకాణం స్థానికుల లోకాభిరామాయణానికి కేంద్రం. ఈ మొహల్లాలో ధూర్తులు, విదేశీ యాత్రికులతో డబ్బులు పిండుకునే వాళ్ళు, వ్యాపారులు, ప్రభుత్వోద్యోగులు, ధార్మికులైన పాండే లు, కాయగూరలమ్ముకునే ముసల్మానులు...ఇలా అందరూ ఉంటారు. వీరి మాటల్లో రాజకీయాలు, సాహిత్యం, మారుతున్న విలువలూ అన్నీ చర్చకు వస్తుంటాయి. ముఖ్యమైన విషయం – ఇక్కడ "బోసిడీకే", "చూతియా" వంటి బూతులు సహజం. తిట్టటం, తిట్టించుకోవడం సంభాషణల్లో భాగాలు. ఎవరూ తిట్లకు నొచ్చుకోరు.

ఈ చిన్ని భారతదేశపు నేపథ్యంలో ధర్మేంద్రనాథ్ పాండే జీవిత కథ ఈ సినిమా. నిజానికి ఇదొక డాక్యుమెంటరీ లాంటిది. కానీ కథ గా తీశారు.

★★★★

ధర్మేంద్రనాథ్ పాండే బ్రాహ్మణుడు. అతనికి కాశీ అన్నా, పారంపరిక సాంప్రదాయాలన్నా, సంస్కృత భాష అన్నా ఎంతో అభిమానం. వాటికోసం పేదరికాన్ని ఎంచుకొని బ్రతుకుతుంటాడు. పగలు అస్సీ ఘాట్ లో తర్పణాలు, కర్మకాండలూ చేయించటం, మధ్యాహ్నం పిల్లలకు సంస్కృతం నేర్పటం, సాయంత్రం జ్యోతిష్యం, ముహూర్తాలు, కుండలి కట్టటం – ఇది ఈయన జీవిక. ఈయన్ను అందరూ గౌరవిస్తుంటారు. భార్య ఇంటిని గుట్టుగా గడుపుతున్నా, అప్పుడప్పుడూ ఇతని చాదస్తానికి విసుక్కుంటూ ఉంటుంది. అందరిలాగే ఇతడు పప్పు దుకాణంలో లోకాభిరామాయణాల్లో పాలు పంచుకుంటుంటాడు. ఆ రోజుల్లో (1990–2000) విదేశీయులు అస్సీ వద్ద వచ్చి తక్కువ అద్దెల్లో కిరాయికి ఉండడం, కాశీని పిక్నిక్ లా భావించటం, పుస్తకాలు వ్రాయటం, ఇలా చేస్తుంటారు. కాశీ వారికొక వింత. ఓ పిక్నిక్. ఓ విలాసం. వారి డబ్బులకు ఆశ పడి అస్సీ లో కొందరు వారికి అద్దెలు కుదర్చటాలు, అవీ చేస్తుంటారు.

ఇలా ఉండగా, అయోధ్యలో రామ మందిర నిర్మాణం కై పోరాటం కోసం అనేక హిందువులు అయోధ్య కు వెళతారు. అక్కడ కాల్పుల్లో పాండే కాలికి గాయమౌతుంది. బడికి పిల్లలు రావడం మానేస్తారు. అతని సంతానానికి ఆంగ్ల చదువు, కూతురికి కంప్యూటర్ చదువూ చెప్పించాలని ఉంటుంది. జీవితంతో ఓడిన పాండే, విధి లేక ఓ విదేశీ వనిత కు తన ఇంట్లో ఆశ్రయం ఇవ్వాల్సి వస్తుంది. అందుకు సిద్ధపడినా, తన పూజగదిని, అందులో కొలువైన పరమేశ్వరుణ్ణి తీసి, అక్కడ బాత్ రూం కట్టించాల్సిన పరిస్థితి. తన దైవాన్ని కోల్పోవడం, నాన్న ను బయటకు తరిమినట్లు గా ఉందని విలవిలలాడతాడు పాండే. విధి లేక, భార్యాభర్తలు లింగాన్ని గంగకు అర్పిస్తారు. అయితే పరిస్థితులు ఒకేలా ఉండవు, అతడి పరిస్థితి కొంత చక్కబడి, తిరిగి కొత్త లింగాన్ని తెచ్చి ఇంట ప్రతిష్ఠించడంతో బాటు, ఫ్రెంచ్ అమ్మాయి వీరి ఇంటి వ్యక్తిగా కలిసి పోయవడంతో ముగింపు.

★★★★★

ఈ సినిమా డాక్యుమెంటరీకి పనికి వచ్చేది. కథ తక్కువ. డ్రామా లేదు. పాటల్లేవు. నటులూ మామూలు నటులే. అంత గొప్పగా తీయలేదు కూడా.

అయితే ఈ సినిమా తీయడం ఓ తప్పని సరిగా జరగాల్సిందే. కాశీ అంటే ఇష్టం ఉన్న వారు , ధర్మా ధర్మాల (విలువల) ఘర్షణ – దీనిపై ఆసక్తి ఉన్నవారూ వీరికి నచ్చవచ్చు.

సంభాషణలు బావున్నాయి. చక్కని అవధి స్పర్శతో కూడిన హిందీ. అక్కడక్కడా సంస్కృత న్యాయాలు "కాంచనం కర్మ విమోచనం", "ఎంత సంపాదించినా తృప్తి నివ్వనిది ధనం ఒక్కటే అన్న అర్థంతో ఒకటి.." ఇలా. యమ నచికేతుల సంభాషణను జీవితానికి అన్వయిస్తూ మొదటా, చివర్నా డైలాగులు ఉన్నాయి. సాధారణంగా కూడా కొన్ని బావున్నాయి.

"అమ్ములూ! పెద్దదానివై పోయావమ్మా. చిన్నప్పుడు పిలువగానే వచ్చి మెడ చుట్టూ చేతులు వేసే దానివి. ఇప్పుడు దూరం కూర్చుంటున్నావు" – కంప్యూటర్ నేర్చుకొమ్మని కూతురుతో చెబుతూ నిస్సహాయంగా చెప్పే నాన్న.

"మొదట్లో ప్రపంచంలో బజార్ ఉండేది. ఇప్పుడు బజార్ లో ప్రపంచం ఉంటూంది."

"జగత్తులో ఏమీ ఇవ్వని వ్యర్థుడూ మనిషే. వీడు పాలివ్వడు, గుడ్లు పెట్టడు, ఇవ్వకున్నా కానీ తింటూ బ్రతుకుతుంటాడు".

★★★★

కాశీ కా అస్సి – ఓ అవసరమైన నవల. (నే నీ నవలపై సుదీర్ఘమైన రివ్యూ మాత్రమే చదివాను). ఈ సినిమా కూడా. అయితే ఇది ఫ్లాప్. సగం సినిమా కూడా నిండలేదు.

సన్నీ డయోల్ – పాండే గా నటించాడు. నాకు వీడంటే చాలా చిరాకు. కానీ కాశీ, గంగా ఇతణ్ణి తమలో కలుపుకున్నాయి. ఫోటోగ్రఫీ బావుంది. నేను వారణాశిలో తెల్లవారు ఝామున గంగను మొదటి సారి చూసినప్పుడు – నీలి తెరపై పసిడి రంగు దీపాలు చూశాను. ఆ దృశ్యం ట్రైలర్ లో ఉంది.  ఊపిరి స్థంభించే దృశ్యం అది (నాకు).

చూస్తే చూడండి. నచ్చకపోతే నా జవాబ్దారీ లేదు.

★★★★★★★★

# అర్జున్ రెడ్డి

*8 Oct 2018, 13:11*

అర్జునః ఫల్గుణః ....

పంచ్ డైలాగుల్లేవు. గాలిలో ఎగిరెగిరి తన్నే ఫైట్లు లేవు.

కోనసీమ సంస్కృతి లేదు. రాయలసీమ ఫాక్షనిజమ్ లేదు.

ఐటెమ్ సాంగ్స్, ఇంటర్వెల్ బ్యాంగు, పవర్ పాక్డ్ హీరోయిజం, వెకిలి కామెడీ, Established morals.....ఏవీలేవు. కొంచెం యాస ఒక్కటీ మార్చి, సాదా లవ్ స్టోరీ తీస్తేనే "ఫిదా" అయిపోయే పరిస్థితి ఇక్కడ. పై హంగులేవీ లేకుండా ఇదివరకు నాకు తెలిసి మలయాళ సినిమాలు రెండొచ్చాయి. దృశ్యం, ప్రేమమ్. మన తెలుగు వాతావరణానికి, ప్రేక్షకుల "నాన్-వెజ్" టేస్టుకూ దృశ్యాలూ, ప్రేమాలూ వంటి "చప్పని" వంటకాలు సరిపడవాయె. మరి అలాంటి Sincere attempt + Quality Packed movie, తెలుగు వాడి అభిరుచికి తగినట్టు నాన్-వెజ్ టేస్ట్ తో వస్తే ఎలా ఉంటుంది? – సమాధానం అర్జున్ రెడ్డి.

అర్జున్ రెడ్డి సినిమా ఘుమఘుమలాడేలా ఓ కొత్త బావర్చీ (దర్శకుడు) వండిన చిక్కటి మటన్ బిరియానీ.

అనగనగా అర్జున్ రెడ్డి అనే బ్రిలియంట్ హౌస్ సర్జన్. ఈయప్ప ఒక ఫస్ట్ యియర్ మెడికో, ప్రీతి షెట్టి అనే తుళు అమ్మాయిని ప్రేమిస్తాడు. ప్రేమలో కామం సహజం కాబట్టి కామిస్తాడు. ఆమెకై ఏడుస్తాడు, నవ్వుతాడు, ఎదుటోళ్ళను తంతాడు, కొట్టి ఏడుస్తాడు అన్నీ.. సహజంగానే అమ్మాయిలకు ఇలాంటి Turbo mode అబ్బాయిల మీద హీరో వర్షిప్ ఉంటది కాబట్టి ఆమె ఇతనికి ట్యూన్ అవుతుంది. ఆమె సైడు నుంచి పెద్దగా కథ లేదు.

అర్జున్ రెడ్డి తన ప్రేమను సొసైటీ లో రిజిస్టర్ చేసుకోవడానికి, ప్రీతిని పెళ్ళి చేసుకోవాలనుకుంటాడు. అందుకు ఆమె తల్లిదండ్రులు ఒప్పుకోరు. కొంచెం డ్రామా తర్వాత ఆమెకు పెళ్ళి జరిగిపోయిందన్న సమాచారం ఇతనికి తెలుస్తుంది. ఆపై ఇతడు Turbo mode, Macho, Modern దేవదాసులా తయారవుతాడు. ఆమెను మర్చిపోవటానికి తాగుడు, డ్రగ్స్ వగైరా వగైరా. ఇలా ఉన్నప్పటికీ బ్రిలియంట్ డాక్టర్ అవడం మూలాన ఎందరో రోగులకు వైద్యం చేస్తూ ఉంటాడు. ఈ Turbo mode, Free spirited దేవదాసు తిరిగి జనజీవనస్రవంతిలో కలిసాడా? చివరికేంటి?

ఈ బయోపిక్ మూవీలో కొట్టొచ్చినట్టు కనబడేది Naturality. డయలాగులు వాటంతట అవే జరిగిపోతుంటాయి. నటన అనేది ఉండదు. పాత్రల ప్రవర్తన మాత్రమే ఉంటుంది. అలాగని హాస్యం లేకపోలేదు. Farce comedy కి చాలా చోట్ల చప్పట్లు పడతాయి. ("ఆడ వాళ్ళకు నెలకు మూడు రోజులు PMS, నీ అసంటోళ్ళకు నెల పొడుగూతా అంతే." :) ) ఫోటోగ్రఫీలో, నేపథ్యసంగీతం లో లోపాల్లేవు. నానమ్మ (పాతతరం నటి కాంచన) పాత్ర చాలా అద్భుతంగా ఉంటుంది. ఆమె పాత్ర ప్రేక్షకుల గుండెలో జీవిస్తుంది. :) A true revelation.

★★★★★★★★★★

పైన చేసింది సినిమా రివ్యూ. సాధారణంగా తెలుగు ప్రేక్షకులకు (ఆ మాటకొస్తే ప్రపంచంలో ఏ ప్రేక్షకులకైనా) సినిమా అంటే సినిమా కాదు. సినిమా అనేది జీవిత ప్రతిబింబం కూడా. ఈ సినిమాలో హీరోకు స్త్రీల పట్ల ఉన్న ఆరాధన చాలామంది మగవాళ్ళకు, స్త్రీలకూ కూడా కంటతడి పెట్టిస్తుంది. నిజంగానే ఈ సినిమా చూసిన అమ్మాయిలు గొప్ప భావోద్వేగానికి లోనవవచ్చు. :) సమాజ

రీతుల పట్ల, పెళ్ళి ఇత్యాది తంతుల పట్లా కసి పెంచుకున్న మగవాళ్ళు (బలి అయిన వాళ్ళు) కూడా ఈ సినిమాను చూసి గొప్పగా, రిలాక్స్ గా ఫీలవుతారు. అవాలి కూడా. :). తప్పకుండా ఇది చలం నవల లాంటి సినిమా. ఇదొక "మగమైదానం".

అయితే ఇక్కడ ఓ విషయం చెప్పాలి. ఈ సినిమాలో అర్జున్ రెడ్డి ప్రొఫెసర్ ఒకాయన తన స్టూడెంట్ ను గురించి ఒక మాటంటాడు. "ఏ సబ్జెక్ట్ లో అయినా తుదివరకూ వెళితే చివరికి మిగిలేది జీరో యే. అర్జున్ రెడ్డి ప్రస్తుతం ఆ జీరో కు దగ్గరలో ఉన్నాడు." విషయం ఏమంటే – స్త్రీ ని పొందడం, వివాహం చేసుకోవడం – ఇవి Absolute zero లు కావు. Marriage is not 0, but it is 1. Similarly love towards a woman is not a 0, but it is 1. In effect, the role hero has played, is a portrayal of "so called love", but not "love" in it self. ప్రేమలో ప్రేమించుట యన్న "భావన" తప్ప మరేదియునూ లేదు అని దేవులపల్లి కృష్ణశాస్త్రి చెప్పినా, Love is some thing, which cannot be defined in positive terms, one can only say, what love is not – అన్న తాత్పర్యంలో జిడ్డు కృష్ణమూర్తి చెప్పినా, essence ఏమిటంటే – 'ప్రేమ అనేది ఆత్మశోధనకు ప్రేరేపించి, సమాధానంగా ప్రశ్న కూడా మిటిగేట్/అనిహిలేట్ అయే ఒక ప్రాసెస్' అని తాత్విక పరిభాష. Zero ramains when question annihilates.

ఏది ఏమయినా ఈ సినిమా ఒక యువకుని ద్వారా ప్రేమ అనే ప్రశ్నకు వెతకబడిన సమాధానం అని ఒప్పుకోక తప్పదు. దొరికిందా లేదా, ఆ సమాధానం నచ్చిందా లేదా అన్నది తర్వాత ప్రశ్న.

ఇలాంటి సినిమాలతో వచ్చే ఇబ్బంది కూడా ఒకటుంది. ఇది ఒక Matured సినిమా. ఇది చూడటానికి Matured ప్రేక్షకులు కావాలి. సాధారణ ప్రేక్షకులకూ, అప్పుడే యవ్వనంలో అడుగిడే యువకులకూ ఈ సినిమా తాలూకు మంచితో బాటు కొన్ని తప్పుడు మార్గాలు, తప్పుడు సందేశాలు – ఈ సినిమా అందించే అవకాశం ఉంది. అర్జున్ రెడ్డికి స్త్రీల పట్ల ఉన్న కరుణ, సెన్సిబిలిటీలు కొందరు యువతకు పట్టవచ్చు. అయితే అతని డ్రగ్స్, పట్టరాని ఆవేశంలో తనకు తప్పుగా తోచినవాళ్ళను చితకబాదడం, సెక్స్ పట్ల ఏ జంకూ లేకపోవడం – వంటి వాటితో కూడా కొంతమంది యువత ఐడింటిఫై అవచ్చు. అలా జరిగితే – అది ఒక అలార్మింగ్ వ్యవహారమే.

అందుకనే ఇలాంటి సినిమాలకూ నార్మల్ Trolling లైపు రివ్యూలూ గట్రా రావాలి.

# నవాబు

*6 Oct 2018, 21:40*

చాలాకాలం తర్వాత ఒక పరిపూర్ణమైన చెత్త చూసిన అనుభూతికి ప్రేక్షకుణ్ణి గురి చేసిన చలనచిత్రం నవాబు. హై క్లాస్ గార్బేజ్.

ప్రేమకథలు తీస్కునే మసిరత్నం కిడ్నీని భీం గోపాల్ శర్మ ఆవహించి ఈ సినిమా తీయించాడేమో అని అనుమానం వస్తుంది. మసి రత్నం అనగానే నల్లటి ఫోటో గ్రఫీ, రకరకాల ప్రేమలు, ఏదో గొప్పగా మాట్లాడేలా మొఖం పెట్టించి, "అన్నం తిన్నావా? చెయ్యి కడుక్కున్నావా?" – ఇలా డయిలాగులు చెప్పించటము, చిలిపి తనం పరవళ్ళు తొక్కే హీరోవిన్, అనవసరంగా అరుపులు, ఊరూరికే భోరున నవ్వే హీరోవిన్, ఇవన్నీ expected. భీం గోపాల్ – మాఫియా ప్రియుడు. తెలిసిందే. మాఫియా., ఇంట్లో వాళ్ళ మధ్య మెకానికల్ గా ఉండే సంబంధాలు, ఫైట్సు, ఛేసింగులు...

ఇలా రెండు విరుద్ధమైన తత్వాలు కలిసి, పాయసానికి ఆవకాయ కలిసినట్టు మారింది ఈ సినిమా.

పదిలంగా అల్లుకున్న ఓ మాఫియా పొదరిల్లు. ఆ పొదరింట్లో తల్లితండ్రులైన ప్రకాష్ రాజ్, జయసుధల మీద హత్యాప్రయత్నం జరుగుతుంది. ఆ పొదరింట్లో ముగ్గురు కొడుకులు. అరవిందసామి గూండా. రెండో ఆయప్ప, మూడో ఆయప్ప – దుబాఇ, సెర్బియాలలో వ్యాపార అయస్కాంతాలు. (Business magnets) వాళ్ళ ఫ్యామిలీలూ, పిల్లలూ, వాళ్ళ మధ్య అనుబంధాలు..

నాయన తర్వాత ఆయన నేర సామ్రాజ్యానికి ఎవడు అధికారి? ఎవడు హత్యాప్రయత్నం చేయించింది? – ఇది కథ.

మసిరత్నం – తల్లిప్రేమ, భార్యప్రేమ, ప్రియురాలి ప్రేమ, సెకండ్ సెట్ అప్ ప్రేమ ఇవన్నీ రంగరించాడు. అయితే మాఫియా కొంపలో ఇవన్నీ ఉండటంతో వాటిని అనుభవించే అదృష్టం ప్రేక్షకుడికి పట్టదు.అరవింద సామి సెకండ్ సెట్ అప్ గా అదితిరావ్ హైదరి ని పెట్టి ఆమెలో చిలిపితనాన్ని చొప్పించారు. ఇది మింగుడుపడదు జనాలకు. (సెకండ్ సెట్ అప్ లో చిలిపితనం ఏంటి?)

ఓంటర్వెల్ వరకూ అన్నాతమ్ముల అనుబంధం,ఆ తర్వాత అన్నతమ్ముల సవాల్ గా మారుతుంది. విలన్ ఎవడో తెలిసిపోతూనే ఉంటుంది.

అరవింద సామికి డబ్బింగ్ – మైసూర్ సురేష్ తో చెప్పించినారు. బాలేదు. శింబును అస్సలు చూడలేము. బొజ్జ పెంచాడతను.

దర్శకుడూ, హీరోలు – ఏదీ ఆసక్తి కలిగించకపోవడంతో ప్రేక్షకుడి పరిస్థితి దయనీయంగా మారుతుంది. సమ్యమీంద్రుడు సీతారామశాస్త్రి పాటలూ, మ్యూజిక్కూ కూడా యథోచితంగా ప్రేక్షకుడిని హింసిస్తాయి.

వెరసి – ఇదొక నొఖార్సయిన చెత్త. ట్రైలర్ కూడా చూడద్దు

## భ్రమరాంగస్థలం.

*9 Apr 2018, 10:54*

అనగనగా "x" అనే నది ఒడ్డున ఊర్లో జందెం వేసుకున్న ఓ ప్రెసిడెంటు ముప్పై యేళ్ళుగా తిష్ట వేసుకుని ఉంటాడు. ఇదీ స్థలపురాణం.

ఇంక కథ:

ప్రెసిడెంటు – జనాలను దోచుకుంటా ఉంటాడు. దోచుకుని ఏం చేస్తాడు? రేడియో వింటాడు, లంకపుగాకు చుట్ట తాగుతాడు, ఇంకా వీలైతే పాలు పితుకుతాడు. అంతే.

ఆ ఊర్లో ఇద్దరు అన్నతమ్ములుంటారు.

"రేయ్" – "ఎంట్రా"

"రేయ్" – "ఎంట్రా"

టైపే. మూడో డయలాగు మటుకు "పూలకుండీలు పగొలకొడుతున్నావు కదరా" బదులు "ప్రెసిడెంటు తో పైసలెందుకు తీసుకున్నావు రా?" అని ఉంటుంది.

తమ్ముడికి చెముడు. ఆ ఊర్లో రామలక్ష్మి అనే అమ్మాయి ఉంటుంది. చిన్నప్పట్నుంచి అదే ఊర్లో ఉన్నా, ఆమె పెద్దదయిన తర్వాత బాత్రూములో, బయటా ఆమె అంగాంగప్రదర్శన చూసి, చెవులు పనిచెయ్యవు కాబట్టి కళ్ళకు పూర్తిగా పని కల్పించి తమ్ముడు హీరో ఆమెతో ప్రేమలో పడతాడు.

ప్రెసిడెంటు మరీ టూమచ్ గా తయారవడంతో హీరో అన్న ప్రెసిడెంటు పదవికి పోటీ చేస్తాడు. ఇలా పోటీ చేసిన వాళ్ళందరూ చచ్చి ఉంటారు. వీడూ చస్తాడు. అన్న హత్యకు తమ్ముడు ప్రతీకారం తీర్చడమే మిగిలిన కథ.

విలన్ను తన సావు సావకుండా, బ్రతికించి, తన పెళ్ళి పెటాకులు వదిలేసి రెండేళ్ళు సేవలు చేసి – ఆపైన విలన్ను హీరో సంపడం – ప్రేక్షకుల కిడ్నీలో రాళ్ళను కూడా కరిగిస్తుంది. తన గెడ్డం కూడా గీకని హీరో, కోమా లో వున్న విలన్ గెడ్డాన్ని గీకడం ఐసులో వాటర్ తెప్పిస్తుంది.

కెమెరా సారు వాడు అదివరకే కొన్ని వేలసార్లు కొల్లగొట్టబడిన లొకేషన్ అందాలను మరొక సారి కొల్లగొట్టాడు. పాటల్లో తెలంగాణా యాస. మొదటి డాన్సు "మురారి" అనే సినిమాలో వచ్చిన డాన్సుకు రీమిక్స్. కేరళ థెయ్యం సాంప్రదాయపు దేవుళ్ళ ఊరేగింపు బొమ్మలను ఈడ్చుకుని వచ్చి మిక్స్ చేశారు.

భీం స్మరణ్ గెడ్డానికి అవార్డు రావచ్చు. మొత్తానికి "ప్రతీకారం", "ఐటెమ్ సాంగు", "అంగాంగ ప్రదర్శన" అన్న పాచిని కొత్తగా వడ్డించిన చిత్రం. సుజ్ఞాతవాసి దెబ్బకు చివికి పోయిన తెలుగోళ్ళకు వేసిన గ్లూకోజ్ బిస్కట్ ఈ సినిమా.

హీరో నటన భ్రమ.

హీరోవిన్ అంగాంగప్రదర్శన

వెరసి

భ్రమరాంగస్థలం.

## Daddy You, Daughter Me

*26 Apr 2018, 12:13*

"అప్పా! నేను పెద్దగయిన తర్వాత నిన్నే పెళ్ళి చేసుకుంటా!" అప్పుడే మాటలు నేర్చిన దో యువాన్ నాన్న భుజంపైకెక్కి కూర్చుని మాట్లాడుతూంది.

"ప్రామిస్?"

"ప్రామిస్"

"చిన్నారి దో యువాన్ పెద్దదైన తర్వాత మా ఇంటి నుండీ వెళ్ళిపోతే నేను ఎంతగానో ఏడుస్తా!"

"ఏడ్వొద్దు అప్పా"...

....

.....

తన కూతురుతో తాను పంచుకున్న చిన్నప్పటి స్వీట్ మెమోరీస్ తాలూకు వీడియో చూస్తున్న "సాంగ్ టే లిమ్" పక్క గదిలో కూతురు అరుపు వినిపించడంతో స్పృహలోకొచ్చాడు. పక్కగదిలో తన కూతురు – అమ్మమీద విసుక్కుంటూంది.

కూతురు: "నాన్న బట్టలూ నా బట్టలు కలిపి వాషింగ్ మిషనులో వేయద్దని చెప్పా కదా అమ్మా? మళ్ళీ ఎందుకిలా చేశావ్?"

"అదేమిటమ్మా? అందరివీ విడివిడిగా ఉతకాలంటే ఎంత సమయం పడుతుంది అమ్మకు? " అప్పుడే గదిలోకొచ్చిన సాంగ్ టే లిమ్ చెప్పాడు.

దో యువాన్ మాట్లాడలేదు. తలవంచుకుని తన గదికి వెళ్ళిపోయింది. నాన్నను ఎదిరించటం అప్పుడప్పుడే నేర్చుకుంటూంది దో యువాన్.

★★★★

పదునాలుగేళ్ళ కూతురు. మధ్యవయసు తండ్రి.

ప్రపంచం జయించాలనేంత ఉత్సాహం ఈమెది. ప్రపంచంలో ఎలానో నెట్టుకురావాలనే నడివయసు నిస్పృహ తండ్రిది.

ఆరంజ్ జ్యూస్ అంటే ఇష్టం ఈమెకు. నాన్నకు షుగర్ కంట్రోల్ చేసే అలోవెరా జ్యూస్.

చదువు ఒక భాగం మాత్రమే అనుకునే కూతురు. చదువే ప్రపంచం కావాలనే తండ్రి.

పాటలు డాన్సులలో ఎక్స్ పర్ట్ ఈవిడ. గొప్ప ఆలోచనపరుడు నాన్న. (ఆఫీసులో బ్యూటీప్రాడక్ట్స్ ఇన్నోవేషన్ డిపార్ట్ మెంట్ చీఫ్)

డేటింగ్ పట్ల ఉత్సుకత కూతురిది. కూతురిని ఎవడైనా మోసం చేస్తాడన్న తపన తండ్రిది.

వాగుడుకాయ, నాన్న దగ్గర మాత్రం మౌనం. ఈయన రివర్సు. మామూలుగా మౌనం, అయిన వాళ్ళ దగ్గర మాటలు.

రంగురంగుల బట్టలు, కురచ గౌను – కూతురు. నాన్న – ఒకటే డ్రెస్సు. తెల్ల చొక్కా, పైన సూటు బూటు. ఎక్కేది ఒకే సబ్ వే. కానీ వేరు వేరు కంపార్టుమెంట్లు.

రెండు భిన్న ప్రపంచాలు. అవి తారుమారైతే?

★★★★

"ఏంటి నాన్నా? ఎప్పుడూ చదువు చదువు? నేను bookworm గా మారాలా? నాకు ఆశలు అవీ ఉండవా?"

"ఆఫీసులో మీ నాన్న ఎంతగా రెక్కలు ముక్కలు చేసుకుంటాడో తెలిస్తే ఇలా మాట్లాడవు"

"నీ కష్టమే పెద్దదా? ఓ మారు లెక్కలు చేసి చూడు తెలుస్తుంది."

"నాన్నపై గొంతు పెద్దది చేస్తావా? బుద్ధిలేదూ? ఓ మరు నాలా ఆలోచించి చూడు"

తండ్రీ కూతుళ్ళిద్దరూ ఇలా ఆర్గ్యుమెంట్ లో ఉన్నారు. వారిద్దరికీ తెలీని విషయం ఏమంటే – వారు వాదులాడుకుంటున్నది "గింప్ కో" అనే వందేళ్ళనాటి చెట్టు క్రింద అని, ఆ చెట్టుకు నూరేళ్ళు నిండిన సందర్భంగా ఆ రోజు చెట్టుక్రింద కోరుకున్న కోరికలు తీరతాయని. ఆ ముక్క దో యువాన్ వాళ్ళ తాతయ్య చెప్పనే చెప్పాడు. తండ్రీకూతుళ్ళిద్దరూ కార్లో ఇంటికి వెళుతున్నారు. ఉన్నట్టుండి ఓ వెలుగు ఏక్సిడెంట్....!!

★★★★

మరుసటి రోజు కూతురు తండ్రిగాను, తండ్రి కూతురిగాను మారిపోయేరు! నిర్ఘాంతపోయారు. ఆపై స్పృహలోకొచ్చారు. ఆపైన ఇద్దరూ ఒకరిమీద ఒకరు అరుచుకున్నారు. చేసేది లేక ఇంటికి బయలుదేరేరు. దారిలో సూపర్ బజార్ కెళ్ళారు. వాళ్ళ తీరూ తెన్నూ చూసి సూపర్ బజార్ వాడు గెంటినంతపని చేశాడు. "సాంగ్ టే లిమ్" (ప్రస్తుతం కూతురిలా ఉన్నాడు) తన ఫ్రెండు అయిన సైకాలజిస్ట్ దగ్గరకు వెళ్ళాడు. అతడికి పరిస్థితి చెబితే అతడు నవ్వేశాడు. కాసేపటికి అతడికి అనుమానం వచ్చింది "తనకు పిచ్చి పట్టిందా?" అని.

జరిగింది గ్రహించటానికి, జీర్ణించుకోవటానికి కాస్త సమయం పట్టింది. ఎలాగైనా అమ్మకు ఈ సంగతి తెలీకూడదంది (అన్నాడు) దో యువాన్. తర్వాతి రోజు నాన్న ఆఫీసుకు కూతురు, కూతురి కాలేజీకి నాన్న బయలుదేరారు.

ఆ ఇదేం కాలేజు? తనూ చదివే కదా పొజిషన్ కు వచ్చాడు. ఆ మాత్రం మేనేజ్ చేయలేనా అనుకున్నాడు కూతురిలా ఉన్న నాన్న.

నాన్న ఆఫీసు! అమ్మో ఎలా వేగాలో ఏమో అనుకుంటూ మొత్తం ఇన్స్ట్రక్షన్స్ తెలుసుకుని వెళ్ళింది నాన్న రూపంలోని కూతురు.

కథ మొదలయింది. కామెడీ అఫ్ ఎర్రర్స్....

★★★★★★

2017 లో వచ్చిన కొరియన్ సినిమా ఇది. క్లాసిక్ అనలేము కానీ చక్కగా సింపుల్ గా తీసిన సినిమా. తండ్రీకూతుళ్ళ పరిస్థితి చివరికేమయ్యింది? నాన్నకూ కూతురికి మధ్య అంతరాలు తగ్గాయా? వాళ్ళ రూపాలు వారికి తిరిగి వచ్చాయా?

కాస్త కన్ఫ్యూజన్ గా ఉన్నా, మంచి సినిమా ఇది. కొరియన్ కల్చర్ తెలిసిన వారికి ఇంకా బాగా నచ్చుతుంది. తెలుగోళ్ళు కాపీ కొట్టే సమయం ఎంతో దూరంలో లేదు.

కూతురుగా మారిన నాన్న – కాలేజులో పడిన అవస్థల గురించిన ఈ క్లిప్ చూడండి. పూర్తీ సినిమా ఫ్లైట్ లో చూశాన్నేను. గొట్టంలో తమిళ్ వాడొకడు పెట్టాడు కానీ కాపీరైట్స్ అని ఆ వీడియోను డిలీట్ చేశారు. కనబడ్డం లేదిప్పుడు.

★★★★★★★

అన్నట్టు ఓ విషయం. "అప్పా" అంటే కొరియా భాషలో కూడా "నాన్న."

★★★★★★★★★★★★★★★

# ఊపరబుడ్డల ప్రేమ.

*24 May 2018, 11:06*

కాలేజు చదువు ముగించుకుని ఉద్యోగం తెచ్చుకుని సెటిల్ అవుతున్న రోజులు. చేతిలో డబ్బు ఆడతా వుంది. బేచిలరిజం.

అప్పుడు సరిగ్గా రిలీజైన సినిమా మృగరాజు. మెగాస్టారు, సిమ్రాన్ క్రేజీ కాంబినేషను. మెగాస్టారు సరే సరి. సిమ్రా ? – శ్రీనాథుడు 'అసత్యమధ్య' అనో, 'కిటకిట కౌను' అనో వర్ణించిన కావ్యనాయిక స్థాయిలో ఉన్నిండె. ఆ తలికే సిమ్రాను (నడుము యొక్క) ప్రతిభను గుర్తించిన తమిళసోదరులు ఆమె పేరు మింద "సిమ్రాంబిగై" అన్న గుడి కట్టించినట్టు వార్తలు వస్తా ఉన్నిండె.

బుక్ మై షోలు గట్రా అప్పట్లో లేవు, ఏకంగా క్యూలో ఎగబడ్డమే; మా వాళ్ళతో కలిసి రణరంగం చేసి టికెట్లు సంపాదించి మొదటి ఆటకు వెళ్ళి కూర్చుంటిమి. అంతే!

ఆ సినిమాలో ఒక సింహం జనాలను తెగ విసిగిస్తా ఉంటుంది. రెండున్నర గంటల హింస తర్వాత లాస్టు సీన్లో మెగాస్టారు సింహాన్ని – చిన్న కాయగూరలు తరిగే కత్తితో పొడిచి చంపడంతో రిలీఫ్.

నిజానికి మెగాస్టారు సింహాన్ని చంపడు. సింహమే తానంతట అది వచ్చి మెగాస్టారు చేతిలో కత్తికి తల గుచ్చుకుని 'ఆత్మహత్య' చేసేసుకుంటుంది. సూక్ష్మంగా చూసినోళ్ళకు కనిపిస్తుందది. చిరంజీవికి మూడు రెట్లు హైటు వెయిటు ఉన్న సింహాన్ని కాయగూరల కత్తితో చంపినా ప్రేక్షకులు క్షమించారు. పిన్నీసుతో గుచ్చి సంపినా ఏమీ అనుకోనుండే వాళ్ళు కాదు.

ఆ సినిమాలో జనాల మనసును భగ్నం చేసిన సీను మరొకటుంది. అది ఎట్టి విధంబనిన...

సిమ్రాను తన వుడ్ బీ రాజారవీంద్రతో ఎగ్జిబిషన్ కు వచ్చి ఉంటుంది. గన్నుతో ఊపరబుడ్డలు (బెలూన్లు) కొట్టటానికి ప్రయత్నిస్తుంటది. రాజారవీంద్ర ఆమెను డిస్కరేజ్ చేస్తుంటాడు అప్పుడు ఆ సీనులో ఎంటరయిన మెగాస్టారు, ఆమెను ఉత్సాహపరచి, ఆమెతో ఊపరబుడ్డలు కొట్టిస్తాడు.

అంతే! ఆ దెబ్బకు సిమ్రాను మెగాస్టారుతో లవ్ లో పడిపోతుంది.

ఈ సీను చూసిన యూత్ మనస్సులు విలవిలలాడాయ్. ఎంత మెగాస్టారు అయినా సరే మరీ, ఊపరబుడ్డలు కొట్టిస్తూనే సిమ్రాను లాంటి ఫిగర్ లవ్ లో పడిపోవడమా! స్త్రీ మనసు వెన్నలాంటిది సరే; ఎంత వెన్నయినా ఫ్రిజ్జులో పెడితే కొంచెం గట్టిగా అవుతది. సిమ్రాను మనసు అంతకంటే అధ్వాన్నమా?

ఈ సీను చూసి తట్టుకోలేకపోయింది యూత్. ఆ సీను తర్వాత రోజుల్లో మెగాస్టారు పతనాన్ని శాసించింది అంటే అతిశయోక్తి కాదు.

అప్పట్లో ఆ సీను చూసి అన్నం కూడా సహించని యూత్ లో నేనొకణ్ణి.

★★★★★★★★★★★★★★★★★

## Pad Man

*28 May 2018, 11:46*

Pad Man అనే సినిమా చూశాను మొన్న శనివారం! స్త్రీలకు సంబంధించిన ఓ సున్నితమైన సమస్య గురించి మనసులో ఎంతో మథనపడి, ప్రపంచంతో పోరాడిన మనిషి కథ యిది.

భారతదేశంలో ఓ చిన్న గ్రామంలో ఓ అమాయకుడు, పెద్దగా చదువుకోని యువకుడు అయిన ఓ మేధావి లక్ష్మికాంత్ చౌహాన్, కొత్తగా పెళ్ళయ్యింది. భార్య గాయత్రి. అతనికి ఇద్దరు చెల్లెళ్ళు, అమ్మ. ఓ చిన్న వర్క్ షాప్ లో వెల్డర్ పని. ఈ యువకుడు తన తెలివితో – ఇంటికి ఉపయుక్తమయ్యే చిన్న చిన్న వస్తువులు చేస్తుంటాడు.

తన భార్య బహిష్టు అయినప్పుడు ఓ మురికి గుడ్డను వాడటం చూస్తాడతను. అలాంటి గుడ్డ తను సైకిల్ తుడవడానికి కూడా పనికిరాదు!

అంగట్లో నేప్కిన్ చాలా ఖరీదు. అది వాడితే, ఇంట్లో పాలు త్రాగటం మానుకోవాలి. (బడ్జెట్ లోటు పూడ్చటానికి). అందుకు లక్ష్మీకాంత్ – తనే ఓ నేప్కిన్ తయారు చెయ్యటానికి పూనుకుంటాడు. అతణ్ణి, అతని ప్రయత్నాన్ని చూసి భార్య, "లోకులు, అత్తగారు, తదితరులూ ఏమనుకుంటారో" అని భయపడుతుంది. ఆపై ఛీదరించుకుంటుంది. ఆపై విడిపోతుంది. తల్లి కూడా అతణ్ణి వదిలి వెళ్ళిపోతుంది. గ్రామస్తులు (ఒకరిద్దరు మినహా) ఏవగించుకుంటారు. అతని ప్రయత్నాన్ని అర్థం చేసుకునే వాళ్ళు (ముఖ్యంగా స్త్రీలు) దాదాపుగా కరువౌతారు.

పట్టువదలని లక్ష్మీకాంత్ – చాలా ప్రయత్నాల తర్వాత, అప్పులు పడి – అతితక్కువ ఖర్చుతో స్త్రీల పాడ్ లను తయారు చేసే యంత్రాన్ని తయారు చేస్తాడు. ఆ యంత్రానికి ఐఐటీలో జరిగే ఓ కాంపిటీషన్ లో బహుమతి వస్తుంది. అయినా అతని సమస్యలు ఆగవు. ఆపై లక్ష్మీకాంత్ ఆ యంత్రాన్ని భరతదేశంలో గ్రామగ్రామాలలో తీసుకుని వెళతాడు. పేద గ్రామీణ యువతులకు ఉపాధి కల్పిస్తాడు. వీటన్నిటికి అతడికి ఓ యువతి సహాయపడుతుంది.

చివర్న యు.ఎన్ లో ఈ అమాయక యువకుడు తనదైన "లింగ్లీష్" లో అద్భుతంగా ప్రసంగిస్తాడు. అతడి ప్రసంగంలో "భారతీయత" అంటే ఏంటో చెపుతాడు. చివర్న అతడి భార్య ఇంటికి రావడంతో ముగింపు.

★★★★★★★★★★★

ఈ కథ నిజంగా జరిగింది. ఆ నిజమైన పాడ్ మాన్ పేరు 'పద్మశ్రీ' అరుణాచలమ్ మురుగనాథన్. ఈ చివర్న అరుణాచలమ్ ప్రసంగం తాలూకు వీడియో. (సినిమాలోనూ ఇలాంటి ప్రసంగం ఉంది).

★★★★★★★★★★★

ఇప్పుడు కొంచెం నా ప్రసంగం.

ఫెమినిజమ్ పేరుతోటి – పొద్దస్తమానం మగవాళ్లను తక్కువచూపు చూస్తూ, స్త్రీల అక్రమసంబంధాలకు సానుభూతి కథలు రాసుకుంటూ, ప్రతీవిషయాన్ని స్త్రీలు వర్సెస్ పురుషులు అనే కోణం లోంచి తప్ప మరేరకంగా చూడలేని ఫెమినిస్టు రచయిత (త్రు)లు, ఈ సినిమా తప్పక చూడాలి. స్త్రీ యొక్క చిన్ని సమస్యను పోగొట్టటానికి యువకుడు ప్రపంచంతో పోరాడవలసిన పరిస్థితి. ఎందుకో ఆలోచిస్తే (అఫ్ కోర్సు అది ఉంటే), తెలుస్తుంది! ( అతడి భార్య అతణ్ణి అర్థం చేసుకుని సహకారం అందించి, తోడ్పడి ఉంటే? అతడు ఎంతో గొప్పవాడై, మరిన్ని ఉపయుక్తమైన పనులతో సమాజానికి ఉపయోగపడి ఉండేవాడు. పాపం! )

ఇలాంటి విషయాలలో ఎడుకేట్ చేయడానికి, ఆలోచించటానికీ ఫెమినిస్టులు ఎందుకు ముందుకు రారో అర్థమే కాదు. (వస్తే వాళ్ళకు పేరు రాదు. ఫెమినిజమ్ ను వాడుకోవడంలో ఉన్న ఆసక్తి నిజమైన ఫెమినిజమ్ లో ఎక్కడ ఏడ్చింది? మగాళ్ళను నానా తిట్లూ తిడితే వచ్చే భావప్రాప్తి ఇట్లాంటి ఆలోచనల్లో ఎక్కడ వస్తుంది?)

ఆ సినిమాలో చూపించిన సమస్యకు అనూచానమైనవి ఇప్పటికీ చాలా ఇళ్ళలో ఉన్నై. ఇలాంటి వంద సినిమాలు చూసినా పరిస్థితి మారదు. స్త్రీలకు ధైర్యం రాదు, పురుషుడు ధైర్యం చెబితే, వాడిపై "కోపం" మాత్రమే వస్తుంది. ఫెమినిస్టులకు ఇలాంటి వ్యవహారాలపై ఆసక్తి లేదు. ప్రతి చిన్న విషయానికీ ప్రతిమగాడూ అరుణాచలమ్ లా ప్రపంచంతో పోట్లాడ్డమూ కుదరదు.

ఏదేమైనా, తప్పక చూడదగిన సినిమా ఇది

## డబ్బింగు పాటలు – మూతి సమన్వయం (lip Sync)

*29 May 2018, 13:18*

మామూలుగా సినిమాల్లో డబ్బింగు పాటలు రాసేప్పుడు, ఒరిజినల్ పాట తాత్పర్యం తో బాటు పాటలో నటకుల మూతి సమన్వయం (lip sync) కూడా చూసుకుంటా ఉంటారు సినీ కవులు.

తాత్పర్యం కొంచెం చెత్తగా ఉన్నా, మూతి సమన్వయం ఒక్కోతూరి చాలా ఇంపార్టెంటు. అది లేకపోతే పాట ఎంత దుర్భరంగా అవుతుందో, మణిరత్నం సారు వాడు తీసిన "బాంబే" సినిమాలో ఈ పాట ద్వారా తెలుసుకోవచ్చు.

"ఉయిరే, ఉయిరే.." అన్న పాటను తెలుగులో వేటూరి సుందరరామమూర్తి దారుణంగా రాచాడు. ఉయిరే, ఉయిరే – ను "ఉరికే చిలుకా" అని రాశాడు. (అసలు చిలుక ఉరుకడం ఏంది/ చిలుక ఎగురుతుంది కదా?) దాంతో, – ఉయిరే, ఉయిరే – రెండవతూరి వచ్చే ఉయిరే దగ్గర "చిలుకా" అనేది – "ఉలూకా" అన్నట్టుగా స్వామి మూతి కదులుతుంది. (ఉలూకమంటే గుడ్లగూబ!)

అట్లే తమిళంలో కాదల్ – అనేదాన్ని "కాటుక" గా మార్చాడు."కాటుక కళ్ళతో కాటువేశావు నన్నెప్పుడో" అన్న ఆ లైను దగ్గర మూతి సమన్వయం అధ్వాన్నంగా ఉంది. 0.56 నుండి 1:04 వరకూ అరవింద బిస్కెట్ స్వామి (మూతిసమన్వయం) నోరు తెరవడం చూస్తే, ఆయన బాధ విరహబాధ కాకుండా, అతి ప్రయత్నం మీద దీర్ఘశంకను ఆపుకుంటున్న వాడి వేదనలా అగుపిస్తుంది.

"ఇంత మన్నేసి పో ఇపుడు" అనే లైను కూడా ఘోరమైన అనువాదం. ఈ పాట పాడిన ఆయన గొంతు కూడా కొంచెం దుర్భరమే. సఖియా – త్సఖియా, చెల్లితే – చల్లితే ఈ టైపులో పీక్కుతిన్నాడు.

చిత్రీకరణ కూడా కొంచెం చిల్లరగానే ఉంది. బిస్కెట్ స్వామి సిన్సియర్ గా చేతిని కోసుకుంటాడు. తర్వాత సీనులో ఆ కోసుకున్న చోట మార్క్ ఏదీ ఉండదు.

ఇలా అనేకవిధాలుగా ప్రేక్షకుల పాలిట శాపంగా మారిన పాట యిది. అప్పట్లో మణిరత్నం సినిమా అన్న ములాజా తో, పారిపోవాలనిపించినా అణుచుకుని, థియేటర్ లో చూసిన పాట యిది.

★★★★★★★★★★★★

## డబ్బింగు తో చిత్రవధ (మూతి సమన్వయం (lip Sync))

*1 Jun 2018, 14:43*

అనువాదం పాటల్లో మూతిసమన్వయం లేకపోతే అది ఎంత వేదనాభరితమో చూసినాం కదా. మూతి సమన్వయం బాగుండి, పాట ను భ్రష్టుపట్టిస్తే ఎలా ఉంటుంది ఇప్పుడు చూద్దాం. ఇలాంటివి కుప్పలు కుప్పలు.

ఇది అపరిచితుడు సైన్మాలో పాట.

లవ్ ఎలిఫెంట్ లా వస్తాడు రెమో;

ముద్దు దంతాల్తో కుమ్ముతాడు రెమో;

అప్పడం హృదయంలో భద్రం రెమో;

రాంపప్ రెమో;

నిద్రను చెరిపే డ్రాగన్ రెమో

పువ్వులు విసిరే స్టెన్ గన్ రెమో

రంభల హార్టులో రింగ్ టోన్ రెమో

రైన్ బో రెమో

ఆల్జీబ్రా తన దేహం; అమీబాలా పరిణామం; కింగ్ కోబ్రా తన వేహం, వీనులకు ఉబలాటం..

ఈ పాట చెవుల్లో దూరగానే, ఏదో పురుగు చెవిలో దూరిన కమ్మని అనుభూతికి లోనవుతాడు ప్రేక్షకుడు. ఒక్కసారిగా పగలబడి ఏడవాలనిపిస్తుంది కూడా.

(ఇప్పుడు కొంచెం నాలెడ్జ్. ముద్దుదంతాలు – దీన్ని వైరిసమాసం అంటారు. ముద్దు – తెలుగు; దంతము – సంస్కృతం. మొదట తెలుగు, తర్వాత సంస్కృతం వస్తే వైరి సమాసం. (మొదట సంస్కృతం, తర్వాత తెలుగు ఓకే అట). ఈ దరిద్రమైన సమాసానికి అర్థం లేదనుకోండి. మూతిసమన్వయం – ఇది కూడా వైరిసమాసమే.

వైరి సమాసాల గురించి రాళ్ళపల్లి వారు భలే చెబుతారు. ఇలాంటి వైరి సమాసాలు తమిళంలో ఉన్నయా? ఒక్కటి చెప్పండి అని మా వెంకట్రామన్ సార్ ను అడిగితే ఆయన ఛప్పున చెప్పేశాడు. ఆ శబ్దం వింటే అవాక్కవుతారు.

............

............

"తిరుపతి" . ఇది ఆయన చెప్పిన వైరి సమాసం. తిరు – తమిళం; పతి – సంస్కృతం.)

బేక్ టు అవర్ పిడక....

మనపాటలో – లవ్ ఎలిఫెంట్ ఏంటో, ముద్దు దంతాల్తో కుమ్మడమేంటో, అప్పడాలేంటో – అసలీ దరిద్రమేందో అర్థమే కాక సైలెంటుగా ఆర్తనాదం పెడతాడు ప్రేక్షకుడు. "కింగ్ కోబ్రా తన వేహం" – ఈడ వేహం – వేగం అన్నమాట.

ఖర్మ ఏమంటే తమిళ ఒరిగినల్ లోనూ ఆ పాట ఇదే విధంగా మురుక్కాలువ కంపు కొడుతుంది.

కాదల్ యానై(లవ్ ఎలిఫెంట్) వరుగిరన్ రెమొ;

ముత్త దంతత్తిల్ ముట్టువన్ రెమో;

అప్పడ ఇడయిల్ బత్తిరం రెమో...

పైన పాటకు గూగుల్ ట్రాన్సిలేషన్ తెలుగు. తమిళ ఒరిగినల్ ను తెలుగులో అట్లే పెట్టినా హింసలో పెద్ద తేడా ఉండదు. ఈ పాటలో ఉన్న మరొక దౌర్భాగ్యం ఏమంటే – తెరపైన ఉన్న విక్రమ్ – పెద్ద అందగాడు, స్టైలిష్టు కాదు. చూడ్డానికి పెద్ద బాగుండడు. వాడు మూతిని రుద్దడం, స్టైల్ గా ఉన్నట్టు ఫీలవడం, అమ్మాయిలు వాణ్ణి ముసురుకోవడం – ఇవన్నీ చూసినప్పుడు కుడితి నీళ్ళలో పడి ఈత కొట్టాలనిపిస్తుంది ప్రేక్షకుడికి.

పైన అన్నట్టు ఇట్లాంటి దరిద్రగొట్టు పాటలు చాలా ఉన్నాయి. "టెలిఫోన్ ధ్వనితో నవ్వేదానా" అని ఒక పాట! నయం – "సైరన్ ధ్వనితో ఏడ్చే దానా" అనలేదు. ఆ పాటలోనే "జాకిర్ హుస్సేన్ తబలా నువ్వేనా" అని ఒక లైను ఉంది. మృదంగ ప్రియులు ఎవరైనా ఉన్నారా? వారి ఫీలింగ్ ప్లీజ్...

హింసాత్మకమైన అనువాదాల్లో రెండో టైపు.

— feeling concerned.

★★★★★★★★★★

## మూతిసమన్వయం – గాత్రహింస

*5 Jun 2018, 16:15*

అర్థసమన్వయం కాకుండా మూడో ముష్టి ఒకటుంది. ఫస్ట్ రెండూ సినిమాకవులకు చెందినవైతే,ఈ మూడోది గాయకులకు సంబంధించిందేది.

ఒక్కో భాషకు ఒక్కో విధమైన ట్యూన్ ఉంటది. ఆ ట్యూన్ – పరభాషాగాయకులకు అంత తొందరగా అర్థమై సావదు. ఇవతల శ్రోతలచెవులకు మాత్రం బాధ తెలుస్తుంటుంది. ఇది సినిమా పాటలకే కాదు కీర్తనలకూ వర్తిస్తుంది.

ఈ గాయాలకు కొన్ని ఉదాహరణలు.

మొహమ్మద్ రఫీ తెలుగు పాటలు – "ముద్దుల త్తలపులు మొదలాయే మరి న్నిద్దుర రానే రాదాయె. కనులు క్కనులు మ్మాటలాడె...." ఈయన ఒక్కో అక్షరాన్ని పట్టిపట్టి పాడుతుంటే అనిర్వచనీయమైన హింస ఒకటి చెవులకు అందుతా ఉంటది. ఈ ఆటిట్యూడ్ హిందీలో ఓకే. తెలుగులో తట్టుకోలేం.

మన బాలు – హిందీ వాళ్ళకు ఇచ్చిన హింస కూడా తక్కువలేదు. మొన్నామధ్య "తుమ్హారీ సులు" అని ఓ సినిమా వచ్చింది. అందులో బాలు అదేదో పాత సినిమాలో పాడిన "బటాతా వడా హై; బటాతా వడా హాయ్య్..." అనే పాటను తెగ "Troll" చేశారు. హిందీలో "हैं" (తలపైన అర్ధచంద్రాకారం) అనేది మన తెలుగులో అరసున్న కు బీరకాయపీచు చుట్టం లాంటిది. దాన్ని ముక్కుతో పలకాలి (అనునాసికమ్). 'हम आपके हैं कौन' అనేదాన్ని బాలు "హము ఆపుకే హై కౌన్" అని "స్పష్టంగా" నోటితో పలుకుతూ పాడ్డం ఓ హింస.

మా కాలేజు రోజుల్లో రక్షకుడు అనే కళాఖండం వచ్చింది. అందులో "చందురునీ తాకినదీ ఆర్మ్ స్ట్రాంగా" అని ఒక పాట ఉంది. ఆ "ఆర్మ్ స్ట్రాంగ్" – చాలా యేళ్ళకు ఎవడికీ అర్థం కాలే. ఆఖరుకు బాలు "పాడతా తీయగా" లో ఓ తూరి దీన్ని వివరించవలసి వచ్చింది. ఇంకా ఘోరమైన హింస ఈ మధ్య వచ్చిన "ఐ" సినిమాలో ఉంది. "నువ్వుళ్టే నా జ్ఞతగా నేనుళ్టా నీ ఊపిరిగా.." అనే పాట యిది. హింసకు పరాకాష్ట ఈ పాట.

ఈ హింసాకాండలో పాలుపంచుకునే వాళ్ళలో జలుబుగొంతు ఉదిత్ నారాయణ, గార్ధభస్వరవిరాజితుడు కుమార్‌శాను, జేసుదాస్, ఇంకా చాలా మంది ఉన్నారు. ఎమ్ ఎస్ సుబ్బులక్ష్మి – "క్షీరాబ్ధి కన్యకకు శ్రీమగాలక్ష్మికిని, నీరజాలయకునూ నీరాజనం" పాట కూడా కొంచెం కన్నీళ్ళు తెప్పించేదే. "జలజాక్షి మోమునకు, జక్కవగు చెంబులకు, నెలకొన్న కప్పు లకు" అని వినిపించేలా ఆవిడ పాడినట్టనిపిస్తుంది. చెంబులు, కప్పులు ఏమిటా అని చాలా రోజులకు(యేళ్ళకు) అర్థం కాలేదు. "జక్కవ కుచంబులు, నెలకొన్న కప్పురపు" అని ఎలానో తెలిసింది.

★★★★★★★★★★★★

# అభిమన్యుడు.

*11 Jun 2018, 11:04*

కరుణాకర్ (కర్ణ) ఆర్మీలో మేజర్. ఇంటి నుంచి చిన్నప్పుడే పారిపోయి ఆర్మీలో చేరాడు. అతడికి లతాదేవి అనే అందమైన డాక్టర్ జ్ఞానబోధ చేయడంతో తన ఊరికి వెళ్ళి, తన చెల్లి పెళ్ళి బాధ్యత నెరవేర్చాలనుకుంటాడు. అందుకు అప్పుకోసం బ్యాంకుల చుట్టూ తిరుగుతాడు. ఎక్కడా అప్పు పుట్టదు.

చివరకు ఓ బ్రోకర్ సలహా మేరకు DFDC బేంకులో తనకో చిన్న కంపెనీ ఉన్నట్టు ఫేక్ డాక్యుమెంట్లు పెట్టి ఆరులక్షలు అప్పు తీసుకుంటాడు. అందులో బ్రోకర్ కమిషన్ పదిశాతం.

అప్పు దొరికిన రెండవరోజు అతని అకవుంట్ లో డబ్బు ఖాళీ. బ్రోకర్ బిచాణా ఎత్తేశాడు. కర్ణ ఎన్నో ట్రాన్సాక్షన్లు చేసినట్టు బేంకి స్టేట్ మెంట్లో ఉంటుంది. డబ్బు పోయినా పోలీసులకు కంప్లయింటు ఇవ్వలేదు కర్ణ. ఎందుకంటే అప్పు వచ్చిందే ఫేక్ డాక్యుమెంట్ల వలన. ఇప్పుడితను అప్పుకు వడ్డీ కట్టడమే కాక, చెల్లి పెళ్ళి కూడా చెయ్యాలి.

ఈ పరిస్థితుల్లో కంప్యూటర్ లో 'ఓనామాలు' తెలియని కర్ణ ఓ పెద్ద ఆర్గనైజ్డ్ సైబర్ క్రైమ్ ను ఛేదించటానికి పూనుకుంటాడు. మెల్లగా మొదలుపెట్టి ఓ కీలకమైన ఆధారం ద్వారా 'వైట్ డెవిల్' అనే ఓ పెద్ద సైబర్ నేరస్థుణ్ణి గుర్తిస్తాడు. ఆ మృదులాంత్ర జానపదుడే (Software Folk) సత్యమూర్తిగా సంఘంలో గొప్పగా చెలామణీ అవుతుంటాడు..

సత్యమూర్తి అలియాస్ వైట్ డెవిల్ ను చంపెయ్యాలనుకుంటాడు కర్ణ. కానీ అతణ్ణి ఏమీ చెయ్యలేకపోతాడు. కర్ణ గురించి, అతనికంటే ఎక్కువ సత్యమూర్తికే తెలిసి ఉంటుంది. తనపై పిస్తోలు గురిపెట్టిన కొన్ని సెకన్లలోనే మేజర్ కర్ణను ఓ పెద్ద నేరంలో ఇరికించడమే కాక, అతని చెల్లెలికి ఏక్సిడెంట్ అయ్యేలా చేస్తాడు సత్యమూర్తి.

ఈ సినిమాకష్టాల నుంచి కోలుకున్న కర్ణ మెల్లగా, స్ఫుటంగా సత్యమూర్తిని స్టడీ చేసి ఒక్కొక్క ఆధారాన్ని పట్టుకుని, అతడి నేరాలను ఎలా బయటకు తెప్పించాడన్నది తెరపై చూసి ఛావాల్సిందే.

★★★★

ఇది ఒక మృదులాంత్ర జానపదగాథ లాంటిది. సినిమా నడుస్తున్నంత మేరా ప్రేక్షకుడి చెవిలో దర్శకుడు పెట్టిన గంపెడు మల్లెపూల బరువు తెలుస్తానే ఉంటుంది, అయినా ఆ మల్లెల సువాసనకు ప్రేక్షకుడు లొంగిపోతాడు.

ఏ ఫోన్ ను పడితే ఆ ఫోన్ ను హ్యాక్ చెయ్యడం, బేంకు అకవుంట్లను చిత్తం వచ్చినట్టు హ్యాక్ చేసి ఒక అకవుంట్ నుంచి మరొక అకవుంట్ కు డబ్బులు వెయ్యడం ఇలాంటి విపరీతమైన తమిళసినిమా మార్కు సీన్లు ఉన్నా, 'ఏదోలే' అని ప్రేక్షకుడు క్షమించేట్టుగా చేశాడీ డైరెక్టరు.

తమిళ హీరోల్లో కొంచెం మనిషి లక్షణాలతో ఉండే హీరో విశాల్. ఈతని సినిమాల్లో "రంకెలు, ప్రగల్భాలు" తక్కువ. పైగా ఫైట్లు బావుంటాయి. అవే ఈ సినిమాను కాస్త నిలబెట్టాయి. విలన్ గా అర్జున్ – సూపర్. ఒంటరబెల్ బాంగ్ కూడా అదిరిపోయింది.

హీరోవిన్ గా సమంతా అక్కినేని ని పెట్టారు. ఆమె – వాళ్ళాయన లాగా నటించింది. లేదా పారితోషికంలో కన్సెషన్ ఇచ్చి ఉండవచ్చు. నవ్వడమే తప్ప ఏమాత్రం నటించకుండా జాగ్రత్త పడిందామె. హీరో హీరోవిన్లకు మొక్కుబడిగా ఓ డ్యూయట్ కూడా ఉంది. ఇది "అప్ప నీ తియ్యనీ దెప్ప" అన్న పాటకు ప్రకాష్ రాజ్ స్టెప్పులేసినట్టు, ప్రేక్షకుడి ప్రమేయం లేకుండా ఉంటుంది. ఈ సినిమాలో కామెడీకి కూడా తగిన స్థానం "కల్పించారు". ఈ సినిమాకు యువన్ శంకర రాజా సంగీతాన్ని చిందించాడు.

చూడాలనుకుంటే, ఈ సినిమాను ఒక సారి చూడొచ్చు. ఈ సినిమా త్వరలో జీ తెలుగు టీవీలో రిలీజయ్యే అవకాశం ఉంది.

## బెంగళూరు దినాలు.

*11 Jun 2018, 12:13*

మొన్న శనివారం – కష్టపడి బెంగళూరు డేస్ అనే మలయాళ చిత్రరాజాన్ని చూడటం కంప్లీట్ చేశాను. ప్రేమమ్ సినిమాకు ముందు వచ్చిన ఈ సినిమాను జనం చాలా పొగిడారు. తెగ అవార్డులు వచ్చాయట.

తీరా సినిమా చూస్తే – ఇదో శేఖర్ కమ్ముల టైపు ఫీల్ గుడ్ సినిమా. "హేపీ డేస్", "లైఫ్ ఈజ్ బ్యూటిఫుల్" సినిమా కథను, మలయాళ స్పైసెస్ వేసి బెంగళూరు మిక్సీలో రుబ్బారు.

కుట్టన్ (నివిన్ పౌలి), అర్జున్ (దుల్కర్ సులేమాన్), దివ్య(నజ్రియా) – కజిన్స్. దివ్యకు పెళ్ళై, బెంగళూరుకు షిఫ్ట్ అవుతుంది. అలాగే కుట్టన్, అర్జున్ బెంగళూరుకొస్తారు. కుట్టన్ – జానపదుడు. (Software Folk). అర్జున్ – రేసిస్టు. (రేసుల్లో పాల్గొనే వాడు).

ముగ్గురి జీవితాల గురించి కథ.

కుట్టన్ ఓ ఎయిర్ హోస్టెస్ తో లవ్ లో పడి, ఫెయిలై, మరో అమ్మాయితో సెటిల్ అవుతాడు.

అర్జున్ ఓ హై ఫై ఫ్యామిలీ రేడియో జాకీతో ప్రేమలో పడతాడు. (ఆమె వీల్ చెయిర్ కాండిడేటు). చివర్న ఓకే.

దివ్య మొగుడికి అదివరకే ఓ లవ్ స్టోరీ ఉంటుంది. అతడి మూడీనెస్ నుంచి దివ్య ఎలా బయటకు తీసుకొస్తుందో చూపించారు.

బెంగళూరు ఓ అద్భుతమైన నగరం అన్నట్టు, సిల్క్ బోర్డు కాడ కూడా అణుమాత్రం ట్రాఫిక్ లేనట్టూ చూపించారు. మూడుగంటల సాగబీకుడు సినిమా. ఎందుకు ఇంత హిట్టయ్యిందో తెలీదు. గొట్టంలో పూర్తి సినిమా పెట్టారు. డవిలాగులు బాగున్నాయి.

"ఎడ వన్ను ముళ్ళులె విణ్ణాలుమ్, ముళ్ళు వన్ను ఎడయిల్ విణ్ణాలుమ్ ఏరది ఎడక్క్యా" (ఆకు వచ్చి ముల్లుపై బడ్డా, ముల్లు ఆకుపై పడినా, ఆకుకే దెబ్బ)

' అల్ల కుట్టన్, అప్పో నీ ఎడయాణో, ముళ్ళు ఆణో?"

(కాదు కుట్టన్, నీవు ఆకువా, ముల్లువా?)

మలయాళ నటులెవ్వరికీ నటించడం రాదు, జీవించడం తప్ప. కాబట్టి సినిమా ఎదురుగా జరిగినట్లుంటుంది. అయితే మనం చాలా సార్లు "ఫీల్ గుడ్" అయినందువల్ల మళ్ళీ "ఫీల్ గుడ్" – బోర్ కొడతది.

★★★★★★★★

## బాంబే మిఠాయ్

*21 Jun 2018, 20:47*

తెలుగు సినిమాల్లో హెచ్చు భాగం ప్రతీకారం ముష్టే అని మనకు తెలిసిందే. ఈ ముష్టి కాకుండా సాఫ్ట్ ముష్టి కూడా చాలాకాలంగా ఉంది. అదే బాంబే మిఠాయ్ ముష్టి. అంటే ఏందంటే – బాంబే పీచు మిఠాయ్ ని చేతి మధ్యలో పెట్టి వత్తేస్తే ఓ చిన్న గుళిక అవుతుంది. ఐతే మామూలుగా అయితే ఇంథ పెద్దగా మంచి రంగులో కానొస్తుంది. ఈ సినిమాలూ అంతే.

హీరో ఫ్రెండ్ భార్యను చెల్లెలుగా భావిస్తా ఉంటాడు. అయితే చూపులు అనుమానాస్పదంగా ఉంటాయ్. లాస్ట్ దాంకా తన మనసులో ఫీలింగ్ చెప్పి సావదు హీరో. మూడుగంటల హింస తర్వాత హీరోవిన్ సూయిసైడ్ వరకూ పోతే తప్ప వ్యవహారం తెమలదు. –ఇది డాక్టర్ చక్రవర్తి సినిమా. ఇలాంటివి ఏయన్నారు చాలా తీశాడు. రేపు సుమంగళి సినిమా వస్తుందంట. అందులో హీరో సమస్య మీరే చూడొచ్చు. :)

మరో టైపు ఫకరదిన్ సినిమాలు. హీరోవిన్ కు మాయరోగమో ఏదో ఉంటది. చెప్పి సావదు. త్యాగాల మీద త్యాగాలు, అపార్థాలు. లాస్ట్ లో అందరూ మూకుమ్మడిగా శోకాలు పెట్టి ఆమె త్యాగం వెనక తర్కాన్ని బయటకు తీస్తారు.

ఈ సినిమాలను పిసికితే ఐదు నిముషాలు. పీకితే మూడు గంటలు. ఈ టీవీ సినిమాలో ఈ బాంబే మిఠాయ్ సినిమాల వారోత్సవం ఉన్నట్టుంది. చూసి కన్నీటి సముద్రంలో ఓలలాడండి. :)

## పరమ–మహానటి.

*22 Jun 2018, 13:22*

సావిత్రి – మహానటి అని మనకు తెలుసు. సినిమా కూడా వచ్చేసింది. ఆమె మహానటి అనడానికి ఋజువుగా మాయాబజారు, మిస్సమ్మ లాంటి సినిమాలు చెప్తా ఉంటారు. అయితే, ఆమె పరమ–మహానటి అని సుమంగళి సినిమా ద్వారా వీజీగా తెలుసుకోవచ్చు. ఓ పక్క ఆ సినిమా పాత్రలో వైవిధ్యం, తీవ్రమైన ఘర్షణ; మరొకపక్క ఏయన్నారు (నటన) ను అంత దగ్గరగా భరించవలసిన పరిస్థితి. ఈ తీవ్రమైన సవాళ్ళను తట్టుకొనిందామె. అందుకే ఆమె పరమమహానటి.

ఏయన్నారు, సావిత్రి నటించిన సుమంగళి; నిన్న మాట్లాడిన పీచుమిఠాయి సినిమాల్లో బీభత్సమైన టైపు.

అనగనగా హీరో, హీరోవిన్ ప్రేమించుకున్నారు. పెళ్ళి అయిన తక్షణం టైమ్ వేస్ట్ చేయకుండానే – హీరో మాడీ నుంచి క్రిందపడ్డంతో వాడి నడుము విరుగుతుంది.

డాక్టర్లు సమస్యను ఫిక్స్ చేసి, ప్రాణాన్ని బ్రతికిస్తారు అయితే, హీరో సంసారానికి పనికిరాడు; ఈ సైడ్ ఎఫెక్ట్ ను డాక్టర్లు ఫిక్స్ చేయలేకపోతారు. అలాగని ఉన్న విషయాన్ని, ఎందుచేతనో యేమో,హీరోకు ఎవ్వరూ చెప్పి సావరు. హీరో ఏమో సైడ్ ఎఫెక్ట్ గురించి తెలీని క్లయింటు లాగా హాపీ గా తనకేం కాలేదన్న ఫీలింగ్ లో ఉంటాడు.

ఈ దరిద్రాన్నంతా మోయాల్సిన బాధ్యత నిజపత్ని అయిన హీరోవిన్ పై పడుతుంది. ఆమె హీరోకి "విషయం" చెప్పలేదు. అలాగని వాణ్ణి తిరస్కరించనూ లేదు. ఈ దరిద్రమైన సంఘర్షణ బాగా సాగిన తర్వాత – ఓ రోజు ఆమె వాడికి విషయం చెప్పేస్తుంది.

అంతే! హీరో ఈ కొత్త ప్రాబ్లెమ్ స్టేట్ మెంటును "ఆమె సమస్య" గా డిఫైన్ చేసి ఫిక్స్ చేయాలనుకుంటాడు. జగ్గయ్యకు తన భార్యను ఇచ్చి వివాహం చేసి ఇష్యూ ఫిక్స్ చేయాలని అతని ప్లాన్. ఈ ఫిక్స్ కి హీరోవిన్, హీరోవిన్ నాన్న ఒప్పుకోరు. నా ఫిక్స్ కి ఒప్పుకోకపోతే విషం తాగి సస్తానంటాడు హీరో. వీళ్ళతో తెగదు, తెల్లవారదు అనేసి, చివర్న హీరోవిన్ సచ్చిపోవడంతో కథ ముగింపు.

★★★★★★

ఈ సినిమాలో నాగేస్రావు ముఖకవళికలు చూసి ప్రేక్షకులైన మనకే తట్టుకోవడం పరమ కష్టం. ఆ కవళికలను భరిస్తూ, పాత్రకు న్యాయం చేకూరుస్తూ, సావిత్రి నరకం చూసి ఉంటుంది. బహుశా ఈ సినిమా ముగిసిన తర్వాత రోజుల్లోనే ఆమె తన లైఫ్ లో "మందు"కు అలవాటు పడి ఉంటుందని నా గట్ ఫీలింగ్.

పాత కాలంలో సినిమాలకు సైడ్ కేప్షన్లు లేవు, కానీ ఉండుంటే ఈ సినిమాకు ఇలా పెట్టవచ్చు.

సుమంగళి

– కామాతురాణం న భయం న లజ్జా.

## కృష్ణార్జునయుద్ధం Old wine in Chittor bottle.

*22 Jun 2018, 22:34*

"అర్జునా! పద్యాలన్నీ అయిపోయినాయి. కొత్త పద్యం మతికి ర్యాలా. ఫస్ట్ బాణం వదుల్తా ఉండా, కాస్కో."

"కృష్ణా, నీ బాణానికి నా అన్సరు."(సారథీ, కృష్ణుని బాణం టిప్ చూపుగా ఉండాది. సరిగ్గా ఆ టిప్ కే మన బాణం గుచ్చుకుంటుందంటావా?)

సారథి: డిజైన్ సూపరన్నా. దగద్ధమానంగుండాది.

"అర్జునా, ఇదిగో ఆగ్నేయాస్త్రం.ఫేస్ ద కన్సీక్వెన్సెస్."

"కృష్ణా, నా కాడ వారుణాస్త్రం ముందుగానే ఎత్తిపెట్నా. ఇగో.."

"అన్నా, ధరమరాజా, మన తమ్ముని బాణం నాణ్యంగుండ్లే?"

"ఔ, భీమా. వీని అస్త్ర కౌశలం చూస్తాంటే కుశాల గుండాది పో".

శివుడు: "ఏంది సాములూ ? సమస్యొస్తే ఇలావరిగ మాట్లాడుకోవాల్సింది పోయి, బాణాలేసుకుంటారెణ్ది? యోవ్, మతికి తెచ్చుకోండప్పా, మీరు నరనారాయణులు."

"మాకు తెలీదా? అర్జునుని బాణాలు వరల్డుకు చూపిస్తామని ఇట్ల. ఆడుకుంటున్నామంతే. ఆంతలికి నీవొస్తివి."

"మొత్తానికి అందరు ఒక సాటికి చేర్తిమి. కుశాల".

★★★★★★★★★★★★★★

## పరుగులు తీసే వయసు – చెక్కిలి రాచే మనసు

*23 Jun 2018, 15:28*

"ఏమప్పా, కెమెరామన్ను హీరో హీరోవిన్ అందరూ వచ్చినారా షూటింగుకు?" నిర్మాత.

"ఆ, ఈ రోజు పాట షూటింగు" దర్శక్

"పాటా, ఆహా థీం ఏంది?"

"హీరో గారు, మీ మనసుకు నచ్చిందేదే.హీరోవిన్ ఉరికెత్తుతా ఉంటుంది. మీరాయమ్మను ఛేస్ చేసి,చేయి పట్టి లాగి, మామూలుగానే ఆయమ్మ మొహానికి అతి దగ్గరగా మీ మొహం తీసుకొచ్చి., ఆమె కళ్ళలో కళ్ళు పెట్టి కామంగా...అదే ప్రేమగా చూడాల."

"ఓహ్, అంటేశాట. చిన్నప్పుడు మా ఇంటి కాడా ఆడపిల్లకాయలతో ఆడతా వచ్చినా.నేనే ఫస్టు ఎప్పుడూ. చలిగా ఉంది కోటు తొడుక్కుంటా."

" ప్రేక్షకులకు మాత్రం ఇది అంటేశాట అని అర్థం కాకూడదు. ఇది యూత్ పాటండి. కోటేసుకుంటే ముసలిగా కనిపిస్తారు. హీరోవిన్ కు మీకు మధ్యన ఏజ్ గ్యాప్ తెరపైన కనిపిస్తుంది. " – దర్శక్

"ఆయప్ప కోటు వేసినా వేసుకోకపోయినా పెద్ద తేడా లేదు. కానివ్వండి."

★★★★

హీరోవిన్: "ఈ రోజు పాటన్నారు. థీం ఏంది?"

"హీరో మిమ్మల్ని వెంబడిస్తాడి. మీరు తప్పించుకోవాల. హీరో మిమ్మల్ని పట్టుకున్నప్పుడు, కళ్ళలో చూడబోయినప్పుడు, అవతలికి ముఖం మళ్ళించుకోండి".

"ఈ పాట మొన్నే వర్షంలో తీసినాం కదండి?"

"అట్లా పాటే, లిరిక్స్ వేరు. ఈ సారి మైదానంలో. వర్షం ఉండదు. మీరు హీరో నుండి పారిపోడానికి అవకాశాలు పుష్కలంగా కల్పించాం.హీరో ఊటీ అంటున్నా వద్దని మన ఊరు మడికట్ల కాడ మైదానం ఎక్కువని తీస్తా ఉండాం. "

"ఇది బాలేదండి. ఆ హీరోకి అదేం రోగమో ఏమో మొఖానికి దగ్గరగా మొఖం తెస్త్యా ఉంటాడు."

"అది పాటలో భాగంగా ప్రేమ"

"కాదండి ప్రేమలో భాగంగా పాట అన్నట్టు చేస్తాడాయన."

"ఫేస్ మల్లిచ్చుకో. నీకు తోచిన పద్ధతులన్నీ వాడు. ఒప్పుకో.మొత్తం పాట ఒకే ఏటుకు లాగిద్దాం."

"ఖర్మ. సరే."

"ఇంకో చిన్నమాటమ్మా. హీరో వయసు నీకు తెలిసిందే. ఆయప్ప నీతో సమంగా ఉరకలేక వెనకబడినప్పుడు నువ్వు ఆగి, రెండు స్టెప్పులెయ్యి. సరేనా...... హీరో గారు, హీరోవిన్ రెడీ."

స్టార్ట్, కెమెరా, యాక్షన్.....

సంజు

*30 Jun 2018, 01:04*

సంజయ్ దత్ కథను న్యూ సెన్స్ లో చెప్పాలని చేసిన పైశాచికప్రయత్నం ఈ సినిమా. ఫలితంగా న్యూసెన్స్ అయింది. సంజయ్ దత్ అరటిపండు వలిచిపెట్టినా తినలేని పరమ అమాయకుడని, అతని నేరారోపణల వెనుక మీడియా, ఇతరులు చేసిన కుట్రలే ప్రధానమని, నిజమైన కథలు వినే వారెవరూ లేరని, ఆ కథను చెప్పప్రయత్నించారు. ఐతే, వీళ్ళు చెప్పే కథ నిజమని గారంటీ ఏంది? అని ప్రేక్షకుడు అడిగితే సమాధానం దొరకదు.

సంజు మాదకద్రవ్యసేవనను, మదపిచ్చిని కూడా "అమాయకత్వం" కింద, రణబీర్ "చిలిపి" నటన కిందా కప్పెట్టే ప్రయత్నం చేశారు. ఈ కారణాల వల్ల అవామిన్ టాబ్లెట్స్ తప్పనిసరౌతాయి. కొంచెం కామెడీ కి కూడా ట్రై చేశారు. అదీ విఫలమయ్యింది.

అనుష్క షర్మ ను ఈ సినిమాలో చూస్తే, విరాట్ కోహ్లీ విడాకులిచ్చే ప్రమాదం ఉంది. దారుణమైన మేకప్. మనిషా కొఇరాలా ను సంజు అమ్మగా పెట్టారు. ఆమె నటన బాగుంది కానీ తల్లీ కొడుకుల అనుబంధం ఎబ్బెట్టుగానే అయింది.

సోను కపూర్, దియ, పరేష్ రావల్ తదితర నటులు తమ పరిధుల మేరకు హింసించారు.

పట్టు తప్పిన కథను బలవంతాన గాడిలో పెట్టే ప్రయత్నం చేసి, ఆ యుద్ధంలో అందరూ అలసిన కథ యిది.

వర్డిక్టు: మహా బేకార్.

## తూవనతుంబికళ్

*28 Jun 2018, 16:29*

"తూవనతుంబికళ్" – అంటే వర్షంలో ఎగురుతూ వచ్చే మిడుతలు. 1987లో వచ్చిన లాలేట్టన్ సినిమా ఇది.

జయకృష్ణ – ఓ మెటీరియలిస్టు. అయితే మనసులో మంచివాడు. ఇతను కాలేజీ చదువు ముగించి పల్లెలో వ్యవసాయం చేస్తూ, అప్పుడప్పుడూ దగ్గరలో ఉన్న పట్టణం – త్రిసూర్ కు వచ్చి మిత్రులతో గడుపుతూ ఉంటాడు. పట్టణంలో ఇతను విశృంఖలుడు, ఇంటిదగ్గర మాత్రం చాలా conservative. ఇది అతని మనస్తత్వం.

ఓ రోజు తన పల్లెకు కొత్తగా వచ్చిన వాళ్ళ ఇంటి అమ్మాయి రాధను చూసి మనసుపడతాడు. సూటిగా కాలేజ్ కు వెళ్ళి ఆమెను పెళ్ళి చేసుకుంటానని ఆమె అభిప్రాయం చెప్పమంటాడు. ఆమెకు ఇతని మొరటు స్వభావం అదివరకే నచ్చలేదు. ఆమె అతణ్ణి తిరస్కరిస్తుంది. చాలా మామూలుగా ఇతడూ వచ్చేస్తాడు.

తర్వాత జయకృష్ణ మరొక అందమైన అమ్మాయి ప్రేమలో పడతాడు. ఈ అమ్మాయి పేరు క్లారా. పేదకుటుంబం. ఇల్లు గడవడానికి డబ్బులు లేక సవతి తల్లి ప్రేరణతో వేశ్య కాబోతున్నది, ఆ అమ్మాయితో ఓ వర్షం కురిసే రోజు శారీరకంగా దగ్గరవుతాడు. ఆ తర్వాత అతడికి ఆమె గురించి తెలుస్తుంది. ఆమె వృత్తి రీత్యా వేశ్య కాదని, పరిస్థితుల కారణాన, ఇప్పుడు అవబోతోందని. అందుకు తనే మొదటి కారణమని తెలుసుకుని కృష్ణ చలించి పోతాడు. ఆమెను పెళ్ళి చేసుకుంటానంటాడు. క్లారా కూడా అంగీకరిస్తుంది. కానీ మరుసటి దినం క్లారా అతనికి కనిపించదు.

ఇతడు జమీందారీ యువకుడని, ఇదివరకు మరొక అమ్మాయిని ఇష్టపడ్డాడని క్లారాకు తెలిసి, అతని జీవితం నుండి తప్పుకుందుకు ఆమె ఎక్కడికో వెళ్ళిపోయింది.

జయకృష్ణ తిరిగి మామూలుగా తన ఊళ్ళో ఉంటాడు. ఈ లోగా రాధకు తన ఇంటి వాళ్ళు, పల్లె వాళ్ళూ, అన్నయ్యా చెప్పడంతో అంతర్మథనానికి గురై, కృష్ణను తిరిగి ఇష్టపడుతుంది. జయకృష్ణ ఆమెకు – తనకూ క్లారాకు మధ్య అనుబంధాన్ని చెపుతాడు. ఆమె ఇతని నిజాయితీని మెచ్చుకుని మరింతగా ఇష్టపడుతుంది. క్లారా తిరిగి రాదనుకున్న జయ ఈమెను లైక్ చేస్తాడు. ఇంట్లో వాళ్ళకూ ఈమె నచ్చడంతో వివాహానికి ఒప్పుకుంటాడు.

సరిగ్గా అప్పుడు క్లారా తిరిగి వస్తుంది. క్లారాతో ప్రతి విషయాన్నీ ఓపెన్ గా చెబుతాడు జయ. ఆమె కూడా చాలా సహజంగా అతనితో స్పందిస్తుంది. ఈ సారి క్లారా, జయ ల మనసులు మాట్లాడుకుంటాయి. క్లారా – రాధను పెళ్ళి చేసుకొమ్మని కృష్ణతో చెపుతుంది. ఇతడు మాత్రం మనసులో దుఃఖిస్తాడు. మరోసారి ఆమెను ఆలోచించమంటాడు. అమె వెళ్ళిపోతుంది.

తిరిగి రాధ కలిసినప్పుడు రాధకు జరిగిన సంగతి చెపుతాడు. రాధ – క్లారా వెళ్ళిపోయిందని, ఆమెను మరిచిపొమ్మని సలహా ఇస్తుంది. ఇద్దరికీ పెళ్ళి కుదురుతుంది. సరిగ్గా అప్పుడు చివరిసారి క్లారా రైలు స్టేషన్ కు రాబోతుందని టెలిగ్రాం ఇస్తుంది.

ఈ సారి రైల్వే స్టేషన్ కు వచ్చిన జయకు క్లారా తన భర్తతో దర్శనమిస్తుంది. క్లారాను భార్య చనిపోయిన ఒక మంచి వ్యక్తి భార్యగా చేసుకుంటాడు. ఆమె జయకృష్ణ కు పెళ్ళిశుభాకాంక్షలు చెప్పి శాశ్వతంగా వెళ్ళిపోతుంది. ఆ స్టేషన్ కు వచ్చిన రాధ కూడా వీరిద్దరినీ చూస్తుంది. చివరికి రాధ, జయకృష్ణల జీవితం ముడివడుతుంది.

ఈ సినిమా చూస్తున్నంత సేపు చలం గుర్తొస్తాడు. హిపోక్రసీలు, సంస్కృతి పేరు మీద కుహనావాదాలు లేని అచ్ఛమైన సినిమా ఇది.

క్లారా, జయకృష్ణల మధ్య జరిగే సంభాషణల్లో కూడా చలం తొంగిచూస్తాడు. ఓ మారు వాళ్ళిద్దరూ ఊరి బయట కూర్చుని ఉంటారు. దూరంగా ఒక ఇల్లు. ఆ ఇంటి నుండి ఒక వ్యక్తి బాధతో అరిచే మూలుగు లాంటి అరుపు వినిపిస్తుంది. అతడొక పిచ్చివాడు. వాడిని వాళ్ళ ఇంటి వాళ్ళు బయటకు పంపక కాళ్ళు కట్టివేస్తే, ఆ కట్ల రాపిడికి అతడి కాళ్ళల్లో వ్రణాలు వచ్చి ఆ బాధతో అరుస్తుంటాడు.

అతని కాలి వ్రణంగా నాకు మారలని ఉందని ఉంటుంది క్లారా.

క్లారా చెప్పే మరొక మాట కూడా అచ్చు చలం భావంలా ఉంటుంది – "ఎక్కడ చూసినా గోడలు, గోడలు. వంటిల్లు, పడకిల్లు, ఇంటి నిండా గోడలే. ఈ గోడలేవీ లేని విశాల ప్రపంచం, ఎన్ని ప్రమాదాలు ఉన్నా సరే చూడాలి. పొద్దున లేవగానే సూర్యుడు కనిపించే ప్రదేశానికి నన్ను తీసికెళ్ళగలవా?".

గొప్ప డ్రామా ఏదీ లేకపోయినా చాలా అందంగా ఉన్న ఈ సినిమా మలయాళంలో ఒక క్లాసిక్. జయకృష్ణగా మోహన్ లాల్. క్లారాగా సుమలత, రాధగా పార్వతి అనే నటి నటించారు. సుమలత ఇందులో తెలుగమ్మాయి. విభిన్నమైన సినిమాలు ఇష్టపడే వాళ్ళు ఈ సినిమాను ప్రయత్నించవచ్చు. గొట్టంలో సబ్ టైటిల్స్ తో ఉంది.

కథ మొత్తం తన మొఖంలో కనబడేలా నటించాడు మోహన్ లాల్. ఈ నటనను తెలుగువాళ్ళు చెయ్యలేరు.

## ఓకే పిచ్చిమొహమ్

*27 Jun 2018, 16:11*

మణిరత్నం అభిమానులకు, సుహాసిని గారికీ రివ్యూ రాస్తున్నందుకు క్షమాపణలు.

ఇదివరకూ వచ్చిన రామాయణ భారతాలూ, బైబిలూ బెడిసి కొట్టడంతో, మణిరత్నం సారువాడు అటు యువకులకూ, ఇటు వృద్ధులకూ, ఎటో నడివయసు వాళ్ళకూ నచ్చేలాగా సమకాలిక కథను తయారు చేశాడు. నిజానికి ఇది కొత్త కథ కాదు. "ఆరంజి" సినిమా కథే ఇది. ఆగండాగండి...పారిపోకండి. ఆరంజ్ అనగానే జెనీలియా, రామచరణూ గుర్తొచ్చి భయభ్రాంతులు అవుతాం. కాస్త ఆలోచించండి. వాళ్ళు లేకుంటే ఆ సినిమా కనీసం కాసేపు కూర్చోబెడుతుంది అనిపించట్లేదా?

మణిరత్నం దాన్ని పసిగట్టి మంచి హీరో హీరోవిన్లను చూసుకున్నాడు. కథలో 'తింగరి' తనాన్ని కవర్ చేయడానికి సాంప్రదాయబద్ధమైన ముసలిజంటను తీసుకొచ్చి ఇంగువ దట్టించాడు. సంగీతమూ, కెమెరా లతో పోపు ఘుమఘుమలాడించాడు. ఆరంజిలో లాగా సిడ్నీ అదీ ఇదీ అనకుండా ముంబాయి లో తీశాడు. మై చాయిస్ కూ మారేజుకూ మంచి లంకె పెట్టాడు.

ఇలా అన్నిటినీ సమతూకంలో వేసి సారువాడు – సినిమా బాలేదు అని చెప్పలేని మొహమాటపు పరిస్థితి కల్పించాడు. యువతురుష్కలు (Young Turks) దులకర్ సులేమాన్, నిత్య మెనన్ జంటనూ చూసి మురిసారు. వృద్ధులు ప్రకాషరాజు లో తమను తాము చూసుకుంటారు. నడివయసు వాళ్ళకు రఘుమాన్ మ్యూజిక్, కెమెరా లాంటి పక్క వాయిద్యాలు ఉండనే ఉన్నాయి. ఇక లెఫ్టిస్టులూ, స్త్రీవాదులూ, లాంటి వాళ్ళకు కావలసినవేవో వెతుక్కుని అడ్జస్ట్ అవుతారు.

మణిరత్నం సినిమా అనగానే తెరపైన కన్నుపొడుచుకున్నా కానరాని కటిక చీకటి అనేక సీన్లలో ఉంటుంది. చాలామంది ఆ చీకట్లో ఏది కనబడుతోందో తెలీక, 'ఏదో కనబడుతోంది' అనుకొని గొప్పగా ఊహించి భ్రమపడ్డారు. ఈ భ్రమలన్నీ ఇప్పుడు పనిచెయ్యట్లేదు. ఆయనకేమో, మబ్బు తప్ప వెలుగు యోగ్యత లేదు. రెంటికి మధ్యస్థంగా ఈ సినిమాలో మబ్బుకు కొంచెం రంగు కొట్టాడు సారువాడు.

ఎంత బావున్నా పబ్బుకెళ్ళి పంచామృతం తాగలేం.

శంకరాభరణం సినిమాను ఐమాక్స్ లో చూడలేం.

శివాజీగణేషన్ గావుకేకలను స్టీరియోఫోనిక్ ఎఫెక్ట్లో వినలేం.

గుడికెళ్ళి పిజ్జాను ప్రసాదంగా స్వీకరించలేం.

అరటిపండు బావుందని తొక్క తినలేం.

అదన్నమాట. సినిమాలో కొన్ని తింగరి యవ్వారాలున్నాయి. ఒక్కటి మాత్రం ఇక్కడ.

"భావము లోనా భాగ్యమునందునూ గోవింద గోవింద అని తలుపవో మనసా" – హీరో హీరోవిన్లు బైకు మీద విశృంఖలంగా ఊరేగేప్పుడు బేక్ గ్రవుండ్ లో ఈ ఆధ్యాత్మిక కీర్తన ఎందుకో?

నిత్య మీనన్ ముఖారవిందాన్ని చూస్తూ ఇట్లాంటివి మర్చిపోవాలంతే. సినిమా చూస్తారా లేదా అది మీ చాయిస్. అదన్నమాట.

## సీతమ్మ పెరట్లో జిల్లేదు చెట్టు

*27 Jun 2018, 13:52*

కథ క్లుప్తంగా (నాకు అర్థమయినంత వరకూ)

ఒక అన్న, ఒక తమ్ముడు, ఒక నాయన, ఒక అమ్మ, ఒక ముసల్ది, ఇంట్లో తెచ్చి పెంచుకున్న ఒకామె. ఒక లవరు. – ఇది కథ.

కథ దీర్ఘంగా

ప్రకాష్ రాజ్ అనే అతను రేలంగి అనే ఊర్లో ఉంటాడు. ఆయప్ప జీవితధ్యేయం ఒకటే. ఎప్పుడూ నవ్వు రాకపోయినా నవ్వుతా ఉండాల. అతనికి ఇద్దరు పని లేని కొడుకులు. ప్రకాష్ రాజ్ కు పొలాలవీ ఉన్నట్టు చూపించినారు. అతని పొలాలను కొడుకులు సాగు చేయచ్చు. కానీ ఎందుకో చేయరు. ఆ అన్నదమ్ములు ఇద్దరూ గోదావరి యాసలో మాట్లాడుతూ అన్యోన్యంగా ఉంటారు. ఇంట్లో ఒకామెను తెచ్చి పెంచుతుంటారు. ఆమె పెద్దోడికి ఆల్మోస్టు భార్యగా వ్యవహరిస్తుంటుంది. ఇంట్లో మరో అమ్మాయి పుట్టింట్లో కాక మెట్టినింట్లో ఉన్నట్టుగా ఉంటుంది. మరో మరాఠీ ముసల్ది కూడా స్పెషల్ అట్రాక్షన్.

ఇంతకూ కథేంది అంటారా? వీళ్ళ ఫామిలీకి మరో ఫామిలీకి గొడవలు. అయితే దరిద్రమేమంటే – వాళ్ళతోనే సంబంధం కలుపుకోవలసి వస్తుంది. దాంతో మనస్పర్థలు. అన్నతమ్ములకు పని లేకుండా ఉండీ ఉండీ ఫ్రస్ట్రేషన్. కడాకు అవతలాయప్ప ఈ రేలంగి ప్రకాష్ రాజ్ రూపాయపావలా ఫిలాసఫీకి పడిపోయి రాజీకొస్తాడు. అది కథ.

నవ్వురాకపోయినా నవ్వటానికి ట్రై చేసి నవ్వు బదులుగా చమట్లు వచ్చినాయి ప్రకాషరాజుకు. ఆ చెమటజిడ్డు వెనకాల నవ్వు ఏడుస్తూ మూలబడింది. మరాఠీ ముసల్ది – అప్పుడెప్పుడో సీతారామయ్య..సినిమా నుండి ఈ సీతమ్మ..సినిమా వరకు గ్లామరు కాపాడుకుంటూ ఒకే రకంగా ఉన్నది. ఆమె చర్మసౌందర్యరహస్యాన్ని వెంకటేశ్వర్లు కు చెప్పుంటే బాగుండేది.

.... ఏం కడుపులో ఓ మాదిరిగా ఉందంటున్నారా? సింక్ దగ్గరకెళ్ళండి. మీదే ఆలస్యం.

★★★★

ఈ సినిమాను ఇప్పటికే అందరూ చూసుంటారు. మా, మా మూవీస్, మా లైఫ్, మా డెత్, మా శ్రాద్ధం, వీటిలో తిప్పుతూ ఉంటే దేంట్లోనో ఒకదాంట్లో ఆడుతా ఉంటుంది. చాలని దానికి హిందీలో సబ్ సే బడ్ కర్ హమ్ – 2 అని వదిలారు. తమిళంలో "ఆనందం ఆనందమే" అని కూడా తీసి వదిలారు.

ఈ సినిమాను చూసి, మనలను మనం అద్దంలో చూసుకుంటే మన ముఖంలో ఎక్స్ ప్రెషన్ ఈ సినిమాలో ప్రకాష్ రాజ్ లాగా ఉంటుంది.

★★★★★★★★★★★★★★

## కిల్లా – మరాఠీ సినిమా

*1 Jul 2018, 21:55*

The sea bore an array of perils

A mighty storm ambushed the lone sailor

The sail snapped, nails unhooked

The sailor persisted, unfazed by what lay ahead.

★★★★★★★★★★★★★★★

ఓ పదకొండేళ్ళ బ్రాహ్మణ పిల్లవాడు. స్వభావతః సిగ్గరి. పూనా నగరంలో నాన్న, మామయ్యల అనురాగాన్ని చవిచూసి పెరిగినాడు. స్కూల్లో చక్కగా చదివి స్కాలర్షిప్పు తెచ్చుకున్నాడు.

ఇప్పుడు..

నాన్న లేదు. అమ్మ ప్రభుత్వోద్యోగి.ఆమెకు రత్నగిరి జిల్లా, మారుమూల పల్లెకు బదిలీ అయింది. కొత్త వాతావరణం, కొత్త మనుష్యులు. కొత్త పరిచయాలూ...

బాబు మొట్టమొదటి రోజు స్కూలుకు వెళ్ళాడు. టీచరు అటెండెన్సు వేస్తోంది. హాజర్ ఆహె, హాజిర్ ఆహే అని పిల్లలు అటెండెన్సు చెబుతున్నారు. చిన్మయ్ కాళే ...టీచర్ పిలిచింది. "ఉపస్థిత్" – ఇదీ ఈ బాబు జవాబు. ఒక్కసారిగా పిల్లలందరూ నవ్వుతూ తిరిగిచూసేరు. చివరి వరుసలో కూర్చున్న అందమైన అమ్మాయితో సహా. టీచర్ పిల్లలను కసిరి, ఈ అబ్బాయి స్కాలర్ షిప్పు తెచ్చుకున్న వాడని చెప్పి పిల్లలందరితో చప్పట్లు కొట్టిస్తుంది.

క్రమంగా అబ్బాయి కొత్త కు అలవాటు పడ్డాడు. భంద్య అనే ఆకతాయి కుర్రాడు, యువరాజ్ పాటిల్ అనే పొడుగాటి వాడూ, మునిష్ మిత్రులయ్యారు. వాళ్ళతో ఆ అబ్బాయి ఎన్నో ఆటలు ఆడుకున్నాడు. ఎన్నో ఊసులు పంచుకున్నాడు. అమ్మకు కూడా ఇరుగుపొరుగుల అండ దొరికింది.

సరిగ్గా అప్పుడు అమ్మకు మరోసారి బదిలీ. ఈ సారి ఆ బాబు ఎలా స్పందించాడు?

హృద్యమైన కథనానికి, అంతకంటే హృద్యమైన పరిసరాలను నేపథ్యీకరించి, పసిమనసుల తడిని, అమ్మ నిస్సహాయతను, చక్కటి హాస్యాన్ని, తెరపై ఆవిష్కరించిన దృశ్యకావ్యం కిల్లా అనే ఈ మరాఠీ సినిమా. కెమెరా, నేపథ్య సంగీతం కూడా వాటికవే సాటి.

ఆ పల్లెకు కాస్త దూరంగా ఒక చిన్న కోట, సముద్రతీరం, ఎండిన టెంకాయలతో పిల్లలు ఆడుకునే గోళీలు, వాగులో ఈతా, సైకిల్ రేసులూ, పరీక్షలో కాపీ కొట్టడాలు, అయ్యవారు తిట్లూ, ఆ తిట్లనుండి తప్పించడానికి ఫ్రెండు సహాయం, సముద్రం పక్కన చేపలు పట్టే జాలరి, ఆ జాలరి చిన్మయ్ ను పడవలో తిప్పడం, కాల్చిన చేపను ఈ పిల్లవాడికి పెట్టడం, అమ్మతో బాబుకు ఉన్న అనుబంధం...వీటన్నిటినీ దర్శకుడు గొప్పగా తీర్చిదిద్దాడు.

★★★★★★★★★★★★★★★★★★★★

ఒరే..

ఆ కట్టడం పెద్దగా పొడుగ్గా ఉంది.

లోపల పైకెళ్ళడానికి మెట్లున్నాయి.

మెట్లెక్కితే పైన మాడీ మీద పెద్ద దీపం.

ఆ దీపం రాత్రంతా వెలుగుతానే ఉంటుంది.

అక్కడ ఆ దీపం ఒడిలో నిలబడితే చల్ల గాలి.

ఎదురుగా ఉన్న "సాగరం" మనకు దగ్గరగా ఉన్నట్టుంటుంది.

అబ్బాయి ఫ్రెండ్స్ తో చెబుతున్నది, లైట్ హవుస్ గురించి కాదు, తన అమ్మ గురించి. అతను చెప్పే సాగరం కూడా ఎవరో కాదు, చనిపోయిన నాన్న "సాగర్".

చెబుతున్న విషయం అటు తెరపై పాత్రలకు కాకుండా ప్రేక్షకుడికి అర్థమవడం ఓ గొప్ప టెక్నిక్. డ్రమటిక్ ఐరనీ అంటారు దీన్ని. పై సన్నివేశానికి కదిలిపోని ప్రేక్షకుడు ఉండడు.

బాబు పూనా నుంచి తీసుకొచ్చిన అమ్మ మీదా, కిల్లాలో తనను వదిలేసొచ్చిన మిత్రులమీదా అలిగాడు. అమ్మమీద కోపం చేసుకున్నాడు. సముద్రంలో చేపలు పట్టే ఫ్రెండుతో, పడవలో సముద్రం మీదకు వెళ్ళి, రాత్రి ఇంటికి తిరిగొచ్చేడు. అమ్మ ఇంటిబయట ఎదురుచూస్తూ ఉంది. బాబు ఏమీ మాట్లాడడు. అమ్మ దగ్గరకెళ్ళి గట్టిగా కౌగిలించేసుకుని చెవిలో "సారీ" చెబుతాడు. ఇటు ప్రేక్షకుల కళ్ళలో తడి.

ఒక్క కన్నీటి చుక్క లేదు. పేదరికాన్ని చూపడానికి మకిలిబట్టలూ, చింపిరిజుత్తూ, మురికివాడలేవు. అమ్మ పడే కష్టాన్ని, పేదరికాన్ని చూపడానికి జిడ్డుముఖపు ఆసరా లేదు.

రెండుగంటలపైచిలుకు ఈ సినిమాలో పాటలు లేవు. ఆ విషయం తెలియనంతగా లీనమవుతాం. సబ్ టైటిల్స్ తో దొరుకుతుంది. ఉత్తమ ప్రాంతీయచిత్రంగా నేషనల్ అవార్డుతో బాటు, బెర్లిన్ ఫిల్మ్ ఫెస్టివల్ లో అవార్డు గెల్చుకున్న సినిమా ఇది.

నాతో ఏకీభవించకపోయినా, ఈ ముక్కలు నచ్చకపోయినా కిల్లా సినిమా చూడవచ్చు. :) బాల్యాన్ని తెరపై చూసుకోవడం ఎవరికిష్టం కాదు?

## గోధి బణ్ణ సాధారణ మైకట్టు

*2 Jul 2018, 16:31*

"ఫోటోలో ఉన్నది వెంకోబరావు. చామన ఛాయ. సాధారణమైన శరీరం. అరవై ఆరు యేళ్ళు. ఎత్తు ఐదు అడుగులా ఆరంగుళాలు. మతిస్థిమితం లేదు. తెలిసిన వాళ్ళు ఫలానా నంబరుకు కాల్ చేయగలరు. "

★★★★★

శివరావు యువకుడు, ఆధునిక తరానికి ప్రతినిధి. బెంగళూరులో ఓ రియల్ ఎస్టేట్ కంపెనీలో ఉద్యోగం. ప్రమోషన్ వచ్చింది. బాంబేకి వెళితే కెరీర్ లో ఎదగడానికి అవకాశం హెచ్చు. యూ ఎస్ కెళ్ళే ఛాన్సూ ఉంది. తల్లి కేన్సర్ తో అదివరకే చనిపోయింది. ఉన్న పరిస్థితుల్లో తండ్రి వెంకోబరావును బాంబేకు తీసుకెళ్ళి కొత్త పరిసరాల్లో ఉంచడం కష్టం. అందుకని 'ప్రాక్టికల్' గా ఆలోచించి, తండ్రికి చెప్పి ఓల్డేజ్ హోమ్ లో చేర్పించాడు.

కొంతకాలం తర్వాత బెంగళూరుకు పని మీద వచ్చిన శివ, తన తండ్రిని 'చూచాడు'. షాపింగ్, బట్టలవీ కొని తిరిగి ఓల్డేజ్ హోమ్ వాకిలి ముందు దింపి వెళ్ళిపోయేడు. అక్కడ మతిమరుపు వెంకోబరావు తప్పిపోయాడు.

★★★★★★

ఇక తప్పనిసరై, శివరావు, వృద్ధాశ్రమంలో వెంకోబరావును చూసుకునే అమ్మాయి సహనతో కలిసి నాన్న ను వెతకటం మొదలుపెట్టాడు.

ఇంతకూ అతిసామాన్యుడైన వెంకోబరావు అంటే ఎవరు?

వెంకోబరావు మృదుస్వభావి. ఎప్పుడూ నవ్వుతూ జీవితాన్ని తేలికగా తీసుకుంటూ ఉండేవాడు. వీధి చివర బడ్డీకొట్టు దగ్గర ఎప్పుడైనా, ఇంట్లో తెలీకుండా దమ్ము కొడతాడు. అతనికి అందరు కన్నడ వాళ్ళలాగానే ద్రవిడ్ బాటింగ్ అంటే ఇష్టం. తన ఫ్రెండు విశ్వనాథ రావు కొడుకు లా తన కొడుకు కూడా ఫారిన్ కు వెళ్ళకపోయినా మంచి ఉద్యోగం తెచ్చుకోవాలని ఆశిస్తాడు. వెంకోబరావు – చిన్నతనంలో శివ గీసిన బొమ్మలను భద్రంగా దాచి ఉంచాడు. తన భార్య చూస్తే తిడుతుందని అలమారా వెనకాల గోడ మీద శివ చిన్నప్పుడు గోడపై గీసిన బొమ్మను అలానే అట్టిపెట్టాడు. ఆ గోడకు మాత్రం సున్నం కొట్టించలేదు. ఇంకా ఎన్నెన్నో చిన్న చిన్న జ్ఞాపకాలతో అల్లుకున్న అందమైన జీవితం ఆయనది… అన్నిటికన్నా అపురూపమైనది, అందమైన ఊసు ఏమంటే – వెంకోబరావుది ప్రేమవివాహం. అతనికి భార్య అంటే ప్రాణం. కాదు కాదు అంతకంటే ఎక్కువ.

★★★★★★

శివరావుకు, సామాన్యుడుగా కనిపించే తన తండ్రి తనకోసం ఎన్ని అవస్థలు పడ్డాడో, ఎంత ఆరాటపడ్డాడో, ఎంతమంది జీవితాలలో అతను స్ఫూర్తి నింపాడో, ఇవన్నీ తెలియసాగాయి. ఆయన జీవితంతో పోల్చి చూస్తే, ఆధునికత/ప్రాక్టికాలిటీ అన్న పేరుతో, తను ఏ ప్రపంచంలో బ్రతుకుతున్నాడో దాని 'విలువ' ఏంటో అర్థమవుతూ వచ్చింది.

ఈ కథ మన కథ. ఈ కాలపు కథ. మనలోనూ ఏదో మూల శివరావు కనిపిస్తాడు. ఇంతకూ వెంకోబు దొరికాడా? నాన్నను వెతుకుతూ, తనకు తెలీకుండానే సహనతో ప్రేమలో పడిన శివరావు కథ ఏమయ్యింది?

కమర్షియల్ ఎలిమెంట్లు జోడిస్తూనే తీసిన హృద్యమైన కథ ఈ సినిమా. నటన చాలా సహజంగా ఉంది. కామెడీ, క్రైమ్ ఎలిమెంట్స్ కూడా కథలో భాగంగా ఉన్నాయి.

చూసి తీరవలసిన సినిమా.

## శ్రీ(బల)వంతుడు

*2 Jul 2018, 17:40*

"తనకు ఎంతో చేసిన ఊరికి తిరిగి కొంత ఇయ్యాల, లేకపోతే దుబ్బగా అయిపోతాం." అన్న – డబ్బా బయట ఆలోచన (Out of box thought) తో వచ్చిన డబ్బా సినిమా శ్రీమంతుడు.

పాతికేళ్ళలో పాతికవేలకోట్లు సంపాదించేసిన వ్యాపార–అయస్కాంతం (బిజినెస్ మాగ్నెట్) గజపతిబాబు కొడుకు మహేష్ బాబు. పదవ ఫ్లోర్ లో ఆఫీసు గది ఉన్న ఆ మహేష్ బాబుకు "ఉన్నతమైన" ఆశయాలుంటాయి. అదేవిధంగా ఈ మహేష్ బాబుకు యండమూరి నవలల్లో హీరోలకూ, హీరోవిన్లకూ ఉండే "మెటాఫిజికల్ ఎంప్టీనెస్" అనే ఒక డిఫెక్ట్ ఉంటుంది. దాన్ని పోగొట్టుకునేదానికి తనవంతు ప్రయత్నంగా శృతిహాసన్ ను ప్రేమిస్తాడు.

ఆ శృతిహాసన్ తన ఊరికి సాయపడాలనే దృక్పథం గల వ్యక్తి. అందుకని కాస్ట్లీ కాలేజీలో రూరల్ డెవలప్మెంట్ అనే సబ్జెక్ట్ మీద ఎమ్బీయే చేస్తుంటుంది. ఆ అమ్మాయి మంచిది (సినిమాలో అందరి దృష్టిలో), అందమైనది (హీరో దృష్టిలో లెండి), దయాగుణం కలది, అమాయకురాలు (ఎమ్బీయే ఖర్చూ, మేకప్పు ఖర్చుతో పది గ్రామాలను బాగు చేయచ్చు అని కూడా తెలుసుకోలేనంత అమాయకురాలు), చారుశీల కూడా. చారుశీల అంటే చక్కని శీలము గలది అని అర్థం. పాటల్లో మాత్రం ఇతోధికంగా అర్ధనగ్నత్వం చూపిస్తుందనుకోండి.

ఆ మంచి అమ్మాయి హీరోకు ఒకానొక రోజు, వాళ్ళ ఊరు ఒక మారుమూల పల్లెటూరు అని, ఆ ఊరును బాగుచేయడం తన తక్షణకర్తవ్యం అని ప్రవచనం చెప్పి అర్జెంటుగా కనువిప్పు కలిగిస్తుంది.

సరే, ఆమె ప్రోద్బలంతో హీరో ఎంబీయే వదిలేసి సైకిలేసుకుని ఒక చిన్న ఊరు దేవరకోటకు పోతాడు. ఆ ఊరిని దత్తత తీసుకుంటాడు. తన ధనబలంతో ఊరిని బాగుచేస్తూ, పశుబలంతో విలన్లను మట్టికరిపిస్తూ ఉంటాడు. ఊళ్ళో వాళ్ళు కూడా మంచి పనుల్లో భాగస్వాములవుతూ, మహేష్ బాబు చెప్పే మంచిమాటలు విని యుద్ధప్రాతిపదిక మీద మనసులు మార్చేసుకుంటూ మంచివాళ్ళైపోతా ఉంటారు.

హీరో మహేష్ బాబులా మెటాఫిజకల్ ఎంప్టీనెస్, మంచితనం వంటి జాడ్యాలేవీ లేని సిన్సియర్ విలన్లు ముగ్గురు ఉంటారు. ఆ ముగ్గురూ వివిధ సందర్భాల్లో భౌతికంగా హీరో "దెబ్బ"కు అణగారిన వారే. వాళ్ళను హీరో పశుబలంతో తన్ని తగలెయ్యటంతో సినిమా ముగింపు.

సినిమాలో హీరో విలన్లను కొట్టినట్టుగా, సంగీతదర్శకుడు సంగీతాన్ని కొట్టాడు. చారుశీల, స్వప్న బాలా, చేర్చినావె ప్రేమ పాఠశాల – అన్న పాట పిశాచాలు అరుస్తున్నట్టుగా ఉంటుంది. పూర్వాశ్రమంలో డ్రిల్లు మాస్టారుగా ఉన్నాయనను కొరియోగ్రఫీ కి తీసుకున్నట్టున్నారు. హీరో డ్రస్సు (హీరో వెనక మంద డ్రస్సు) కూడా ఫైవ్ స్టార్ హోటల్లో వెయిటర్స్ లా ఉంటుంది.

ఫైట్లు చూడలేం. హీరోవిన్ ను చూడలేం. పాటలు వినలేం. విలనీ చూడలేం. కామెడీ చూడలేం. మిగిలింది మహేష్ బాబు, గజపతిబాబు, రాజేంద్రప్రసాద్. వారే ఈ సినిమాకు ఆయువుపట్టు. గజపతి, సుకన్య జంట ప్రేక్షకుల కన్నులకు పీర్లపండుగ.

సినిమా థియేటర్ లో సమోసాలు బావున్నై. పాటలు వచ్చినప్పుడల్లా చేసిన పని అదే.

★★★★★★★★★★★★

# భయానకచిత్రరాజము

*4 Jul 2018, 16:55*

దెయ్యాల సినిమాలంటే నాకు ఇష్టం. దయ్యాలు, వాటి సంస్కృతి, జీవనవిధానం, సాంప్రదాయాలు, వాటి భావోద్వేగాలు ఇవన్నీ కట్టిపడేస్తాయి. నా దెయ్యపు సినిమా అనుభవాలు చాలా పెద్దవి. వాటితో మొదలెడతాను.

అనగనగా, అంటే కాలేజ్ చదువుతున్న రోజుల్లో మా ఊరికి ఎగ్జార్సిస్టు అన్న పాచిపోయిన పాశ్చాత్యసినిమా వచ్చింది. యూరోప్ ను గడగడలాడించిందని పేరు. ఆనందంతో ఆ సినిమాకు ఇద్దరు ఫ్రెండ్స్ కలిసి సెకండ షోకు వెళ్ళాము. సినిమా అప్పటికే మొదలైంది. హాల్లో ఎక్కువ జనాల్లేరు. ఇక బాగా భయాన్ని ఎంజాయ్ చేయచ్చు అని సీట్లలో కూర్చున్నాం.

......నీరవనిశ్శబ్దం. ఓ మోస్తరు భయంకరమైన అర్ధరాత్రి. దూరంగా కుక్క ఏడుస్తోంది.

......ఆ కుక్క ఏడుపు సినిమాలోది కాదు. థియేటర్ బయట గల్లీలో కుక్క ఏడుపది. విషయమేమంటే, ఆ సినిమా సవుండు సిస్టమ్ రిపేర్ లో ఉంది. థియేటర్ లో శబ్దాలకన్నా బయట కుక్కల శబ్దం బాగా వినిపిస్తుంది. దయ్యం సినిమాకు మంచి థియేటర్ ఎంచుకోవాలని అప్పుడు జ్ఞానోదయమయింది.

ఆ తర్వాత ..."సామి" అని ఒక దెయ్యపు సినిమా వచ్చింది. అది త్రీడీ అట. త్రీడీలో దెయ్యపు సినిమా అని లొట్టలు వేసుకుంటూ కాలేజు ఎగ్గొట్టి సినిమాకెళ్ళాం. థియేటర్ కూడా పర్లేదు. అయితే లోపలకెళ్ళిన తర్వాత తెలిసింది. త్రీడీ అద్దాలు మోసుకొస్తున్న బండికి ఆక్సిడెంట్ అయి ఆ కళ్ళద్దాలు రాలేదు. దాంటో త్రీడీని నాన్-త్రీడీ గా మార్చి సినిమా చూపించసాగారు. అదొక నరకం.

ఆ సినిమాలో సామి – శంకరశాస్త్రిలా చాదస్తపు దయ్యం. తెగ విసిగిస్తుంది.

ఆ తర్వాత పూనాలో మరో సినిమాకెళ్ళాను. సాగర్ థియేటర్ బావుంటుంది. ఫస్ట్ రోజు, పైగా కొత్తసినిమా, పాశ్చాత్యసినిమా. ఈ సారి దెయ్యాలు బలహీనంగా ఉన్నాయి. దెయ్యాలొచ్చి యువకులను, యువతులను పట్టుకుంటాయి కానీ వాళ్ళు విడిపించుకుని పరిగెడుతుంటారు. అలా విడిపించుకునే మాత్రానికి దెయ్యాలెందుకు?

ఇలా చాదస్తపు దెయ్యాలు, వెకిలి దయ్యాలు, మొఖం మీద బంకమన్ను మెత్తిన దెయ్యాలు, కళ్ళ మధ్య సోడాగోళీదయ్యాలు, విరహ దయ్యాలు చాలా వచ్చాయి. దెయ్యం పేరు మీద సినిమా కూడా వచ్చింది. అందులో గెడ్డం చక్రవర్తి, హీరోయిన్ మహేశ్వరి మధ్య రొమాంటిక్ సన్నివేశాలు మహా భయంకరమైనవి. ఒళ్ళు గగుర్పొడుస్తుంది.

ఈ నేపథ్యంలో మయూరి సినిమా కెళ్ళాను నిన్న. కరుణరసభరితమైన దెయ్యమిది. సినిమాను సినిమాలాగా తీసి ఉంటే "మాతృదేవోభవ"కు మీనియేచర్ వర్షన్ లా "మాతృభూతోభవ" అయ్యుండేది. అయితే దర్శకుడు సినిమాను – తెలుగు సినిమాలా కాకుండా Passion గా తీశాడు. దాంతో ఉత్కంఠభరితంగా వచ్చింది.

ఒక క్లాసికల్ నెరేషన్ ఈ సినిమా. సంస్కృత డ్రామాలలో "అంతర్నాటకం" అనే ప్రక్రియనూ, కొవ్వలి లక్ష్మీనరసింహారావు జానపదనవల తాలూకు నెరేషన్ నూ మిక్స్ చేసి మాడ్రన్ ట్రీట్ మెంట్ తో కథనూ, కథనాన్ని రాసుకున్నాడు. కొవ్వలి జానపద నవల (జగజ్జాణ) మొదట ఒక కథగా మొదలై, మూణ్ణాలుగు కథలుగా విడిపోయి, ఒక్కొక్కటి ముడిపడుతూ చివర్న ఒకే కథగా అవుతుంది.

నగరానికి దూరంగా అడవిలో మాయావనం అనే అసైలమ్ ఉంది. ఏ దిక్కూ లేని మానసిక రోగులను అక్కడ చేర్పిస్తారు. అక్కడ వాళ్ళపై ఏవేవో వైద్యప్రయోగాలు జరుగుతాయి. ఆ ప్రయోగాలు ఫెయిలై వాళ్ళు చచ్చిపోతే అక్కడే పూడ్చేస్తుంటారు. బయట ప్రపంచానికి అక్కడ సంగతులు తెలీవు. అక్కడ ఒక యువతిని చేర్పిస్తారు. ఆమెనూ, కూతురినీ విడదీస్తారు అక్కడ వాళ్ళు. ఆపైన ఆమె చనిపోతుంది.

పైనిదంతా ఒక మాగజైన్ లో సీరియల్ కథ. నిజమైన కథ. ఆ కథను ఎవరైనా నమ్మకపోతే విచిత్రమైన దృశ్యాలు జరుగుతాయి. ఆ కథ రాస్తున్న జర్నలిస్టు మదన్ కథ ముగింపు కోసం ఆ అసైలమ్ కు తెలిసిన అతణ్ణి తోడుగా తీసుకుని ఓ రాత్రి వెళతాడు. అతడు తిరిగి రాడు. తిరిగి వచ్చిన మిత్రుడు కూడా మేడపైనుండి పడి చచ్చిపోతాడు. వీళ్ళిద్దరికీ ఫ్రెండు మరొక యువకుడు ఈ వ్యవహారాలను తేల్చాలని బైకుపై వెళతాడు...

పై రెండు పేరాల కథా ఒక సినిమాలో భాగం. ఆ సినిమా ఒక్కరే పూర్తిగా చూస్తే ఐదు లక్షల బహుమానం. ఒకతను ఆ సినిమా చూడబోయి విచిత్రంగా చచ్చిపోతాడు. భర్తతో విడిపోయి, బిడ్డతో బతికే మయూరి అన్న యువతి డబ్బు అవసరమై ఆ సినిమా చూడటానికి వస్తుంది. ఆపై ఏమయ్యింది అని – సినిమాలో చూడవచ్చు.

కథ ఉత్కంఠగా ఉండటంతో సమోసాలకు, కూల్ డ్రింకులకు, సిగరెట్లకూ బయటకు పోయే అవసరం ఉండదు. చంద్రబోస్ రాసిన ఏడుపు పాట తట్టుకోవచ్చు. దయ్యాలు భయం కలిగించినా, అంతకు మించి ఉత్కంఠ కలిగిస్తాయి. అయితే సినిమా హీట్ దిగిపోయిన తర్వాత సినిమాలో అసంబద్ధమైనవి అక్కడక్కడా గుర్తుకొస్తాయి కానీ క్షమించెయ్యవచ్చు. తమిళ సినిమా దర్శకుడనుకుంటాను, కాస్త ఏడుపుకు ప్రాధాన్యత ఉంది. అయితే అదీ తట్టుకోవచ్చు.

ఫోటోగ్రఫీ పర్లేదు. నేపథ్యసంగీతం బావుంది అయితే అక్కడక్కడా చెవుళ్ళు దిబ్బెళ్ళు పడేలా సవుండు. As usual, నయనతార బావుంది. ఈ మధ్య దెయ్యాలను కుర్చీలో కూర్చోబెట్టటం ఒక ట్రెండు. అదీ ఓకే.

"ప్రపంచంలో అందరినీ నరుకుతా..", "రాముడు బాణం వాడాడు, నేను కత్తి వాడతా..", "ఒక్క సారి ప్రేమిస్తే చచ్చేదాకా, ఆపైన కూడా ప్రేతమై కూడా ప్రేమిస్తా..." టైపు హీరోల సినిమాలు వస్తున్న రోజులివి. కాబట్టి ఈ సినిమాను ఎంకరేజ్ చెయ్యచ్చు.

## Mission – Avoidable.

*28 Jul 2018, 10:37*

ఇది ఇంతకు ముందు వచ్చిన సిరీస్ లానే ఉంది. వాటిలో కొంచెం కథ అర్థమయ్యేది. హీరోవిన్లు నేత్రపర్వంగా ఉండేవారు. ట్విస్టులు ఆసక్తి కరంగా ఉండేవి. ఆ భాగ్యాలేవీ నోచుకోని సినిమా యిది.

టాం క్రూయిస్ ఇదివరకు కోటు తోడుక్కుని కొంచెం మన అక్కినేని నాగేస్రావు లా అర-రొమాంటిక్ గా కనిపించే వాడు. ఇప్పుడు వయసు పైబడి మొఖంలో చిలిపి నవ్వు బదులు దీనత్వం, ఉత్సాహం బదులు ఫ్రస్ట్రేషన్ చోటు చేసుకున్నాయి.

సినిమా లో కథ ఏమీ ఉండదు. ఎవడో విలన్ ప్లూటోనియం లడ్డూలు దొంగతనం చేసి కొండలమధ్య పల్లెటూళ్ళో ఏవో రియాక్టర్లు చేస్తూ ఉంటాడు. (ఆ పల్లెటూళ్ళో బాంబులు ఎందుకు? ఏమో నాకూ తెలీదు). వాణ్ణి పట్టి, ఆ లడ్డూలను డిఫ్యూస్ చెయ్యాల. డిఫ్యూస్ చెయ్యాలంటే, బాంబులను, టైమర్ ను, రిమోటును కలిపి డిఫ్యూస్ చెయ్యాల. అక్కినేని టాం క్రూయిస్, వాడి బృందంలో సభ్యులు కలిసి ఆ పనికి పూనుకుంటారు. ఈ ఏక్టివిటీ మొత్తానికి 15 నిముషాలే టైం.

చిన్నప్పుడు బంతితో 'వీపులు గుద్దే ఆట ' అని ఆడే వాళ్ళం. ఈ సినిమాలో, హీరో, విలన్ అదే ఆటను హెలికాప్టర్లతో ఆడతారు.

హీరో తప్ప మిగిలిన నటకులందర్నీ, ఏదో డ్రామా కంపెనీ నుండి హోల్ సేల్ గా మాట్లాడి తోలుకొచ్చిండారు. విలన్ లో శాస్త్రవేత్త లక్షణాలకంటే, "మీటర్ పైన ఇరవై ఎక్స్ట్రా" అడిగే ఆటో వాడి లక్షణాలు ఎక్కువగా ఉన్నాయి.

ఫోటోగ్రఫీ బాగుంది. లొకేషన్స్ బాగున్నాయి. నేపథ్య సంగీతాన్ని సంగీత దర్శకుడు శ్రమపడకుండా లాగించాడు.

సినిమా సారం అంతా చివరి 15 నిముషాల్లో ఉంటుంది. భారీ "ఎత్తున" చిత్రించారు. జర్మనీలో కొండప్రాంతాలను చూడలేని పేదవాళ్ళు ఈ సినిమాను ఓ మారు చూడవచ్చు. అదీ లాస్టు 15 నిముషాలు.

## గూఢచారి

*15 Aug 2018, 10:31*

గూఢచారి సినిమా నిన్న నాచేత చూడబడినది. కొత్త తెలుగు సినిమాల్లో 'బాగుంది ' అని చెప్పడానికి నోచుకోబడిన అతితక్కువ సినిమాల లిస్టులో ఇది చేరుతుంది. ఈ సినిమా పేరు బావోలేదు. ఏదో ఫ్యామిలీ డ్రామా లేదా మర్డరు కథేమో అన్నట్టు ధ్వనిస్తుంది కానీ రక్షణ వ్యవస్థ నేపథ్యంలో సినిమా ఇది.

హీరో అడివి శేషునిలో సూపర్ స్టార్ కృష్ణ లక్షణాలు అక్కడక్కడా అగుపిస్తాయి. ఇతడి ఏడుపుకన్నా ఇతని నవ్వు (చిలిపితనం వగైరా) ప్రేక్షకుణ్ణి ఎక్కువ బాధిస్తుంది.

హీరో హీరోవిన్ మధ్య కొంపలు మునిగేటంత ప్రేమ చూసీ చూడగానే మొదలవటం, కొన్ని మిస్ కాస్టింగులు, హీరో ఫైట్లు, ప్రకాష రాజు – తీసుకున్న పారితోషికంలో ప్రతిపైసాకు న్యాయం చేకూర్చాలనే తపనా – ఇవన్నీ కొంచెం జీర్ణం కాకున్నా పర్లేదు అని సరిపెట్టుకోవచ్చు. హీరోవిన్ అంత బావోలేకున్నా బావున్నట్టుగానే అనిపిస్తుంది.

కథ డిఫెన్సు అదీ ఇదీ అని చాలా కాంప్లెక్సు. లోపాలు ఉన్నా, ఆ లోపాలు తలుచుకుని బాధపడే టైము ప్రేక్షకుడికి ఉండదు. వేగంగా లాగించారు. సినిమా చివర్లో గజపతి బాబు వచ్చి ఆ వేగాన్ని తగ్గించడమే కాకుండా, ఉన్నంతసేపు ప్రేక్షకుణ్ణి హింసించాడు.

రెండు పాటలు ఫోటోగ్రఫీ – ఇవీ సినిమాలో ఉన్నాయి. నేపథ్య సంగీతం చాలా బావుంది. చూడబుల్ సినిమాయే అని నా ఫీలింగ్.

★★★★★★★★★

## చవట సంగమం.

*25 Sep 2018, 13:57*

ఈ సినిమాలో చివర్న హీరోను వర్ణిస్తా పాటొస్తుంది. అందులో భర్తృహరి శ్లోకం చెప్తారు.

జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః |

నాస్తి తేషాం యశః కాయే జరామరణజాం భయమ్ ||

సుకృతినః = సత్పురుషులు; రససిద్ధాః = రసపరిపూర్ణులు అయిన; కవీశ్వరాః = కవీశ్వరులు; తే = వారలు; జయంతి = ఉత్కృష్టముగా ఉన్నారు; తేషాం = వారి యొక్క; యశఃకాయే = కీర్తిశరీరాలకు; జరామరణజాం = ముసలితనము, మరణముల వల్ల వచ్చే భయము; నాస్తి = లేదు.

ఓ యబ్బ! ఆ స్వామి ఎంత గొప్పోడో! ఇంతకూ ఆయప్ప ఏమి ఊడబీకినడప్పా? అంటే కిమ్మన్నాస్తి. రససిద్ధుడు – పోన్లే బాగా (మాదక) రసము స్వీకరించి సిద్ధుడైనాడు లే అనుకోవచ్చు. కానీ సుకృతిన్, కవీశ్వరుడు ఎట్లా అయినాడు?

ఆయప్ప కు డాన్సు అంటే చానా ఇష్టం. అక్కడెక్కడో ఢిల్లీలో అందురూ కలిసి డాన్సు చేస్తారంట. విదేశీ రాయబార్లు, ప్రైమ్ మినిస్టరు వచ్చి చూస్తారంట. అక్కడ పోయి ఈయప్ప డాన్సు చేయాలంట.

ఆశయం మంచిదే, దానికి ఒకొక్క మెట్టుగా ఎక్కవచ్చును. మొదట తన ఊళ్ళో, ఆపైన తన స్టేట్ లో, తర్వాత మెలమెల్లగా ఇంకొక చోట..అట్లా ఎదిగితే – ఏమోలే అనుకోవచ్చును.

ఈయప్ప డాన్సును గుడిలో చూసి జయప్రద ఫుల్లు రెకమెండేషన్ తో ఆ ఢిల్లీ ఫెస్టివల్ లో ఈయప్పకు అవకాశం తెప్పిస్తాది. ఆ ఢిల్లీ ఆర్గనైజర్స్ – కనీసం వీని డాన్సును ముక్క కూడా చూసుండరు, ఫోటో కూడా చూడరు. పోనీ అంత ఫేమస్సా అంటే అనామతు. కేవలం జయప్రద చెప్పేసిందని ఈయప్పకు డాన్స్ చేసేకి అవకాశం ఇప్పిస్తారంట. రిహార్సిలు కూడా లేకుండా.

హీరోయిన్ హీరోకు ఇది చెప్తానే – హీరో, దగ్గుకుంటూ, ఏడ్చుకుంటూ, తుమ్ముకుంటూ, నవ్వుకుంటూ, వైల్డ్ గా తన ఆనందం ప్రకటిస్తాడు. తీరా టైముకు కుదరకపాయ. ఐతేనేమి? మళ్ళీ నెక్స్ట్ ఇయర్ కు ఇంకోతూరి జయప్రద రెకమెండేషన్ తీసుకొని పోవచ్చు. కానీ అదేదో పెద్ద విఘాతంలా పిక్చరిస్తారు.

ఇంతలో జయప్రద మొగుడొస్తాడు. ఈయప్ప జయప్రదను ఆ మొగునికి కట్టబెట్టేస్తాడు. ఇది మనః స్ఫూర్తిగా చేసాడని అనుకుంటే; బాధ ఏమీ ఉండకూడదు. జయప్రదకు మొగుడున్నాడు. ఆమె వాడి కాడికి పోయింది. దానికి ఈయప్ప డిప్రెషన్ కు పోయి తాగుడు ఏమిటికి? ఆమె సచ్చింటే తాగుడు మొదలు పెట్నాడంటే అర్థముంది; లేదూ ఆమె వీణ్ణి కాదని పోయుంటే డిప్రెషను కు అర్థముంది. ఆమె మొగుడితో పోతే, అదీ ఈయప్ప ఆమోదించిన తర్వాత – డిప్రెషన్ తో తాగుడెందుకో? (అట్లా తనకలాట కు బదులు ఆ జయప్రద మొగుణ్ణి ఛావగొట్టి, తరిమేసి ఈయనే జయప్రదను చేసుకొనుండచ్చు. :) )

ఇట్లా తాగుడుకు బానిస అయిన అతను తను యేళ్ళ తరబడి నేర్చుకున్న డాన్సు ను ఒక చిన్న క్రాష్ కోర్సులో శైలజ కు నేర్పించేసేస్తాడు. "సాగరసంగమమే ఒక యోగం, క్షారజలధులే క్షీరములాయె" – అని వెనకాతల పాట!

ఇప్పుడు ఎవరికి ఏమి ఒరిగింది? అంతగా ఈయన కళకోసం ఏమి చేసినాడు? ఏదీ ఉండదు. కళాకారుడు, కవీశ్వరుడు అంటే బయట నగిషీపనోడు అని కాదు. అంతర్గతంగా సున్నితంగా ఉండేవాడు. అంత సున్నితమైన వాడు రెకమెండేషన్లను తీసుకోడు. (మంటో – తన ఆప్తమిత్రుడు శ్యామ్ డబ్బులు ఇవ్వబోతే, అరేంజ్ చెయ్యబోతే తీసుకోనట్టు). నిజమైన కవి/కళాకారుడు – తన పనిని – ఆ విలువ తెలిసిన వాడు మెచ్చుకుంటే చాలా ఆనందపడతాడే కానీ మినిస్టర్ల ముందర ప్రదర్శించి శాలువాలు దండుకోవాలనో, అమాంతం లైమ్ లైట్ కొచ్చేయాలనో, ఓవర్ నైట్ స్టార్ కావాలనో ఆశపడడు. అట్లాంటాయన కవీశ్వరుడెట్లా?

టంబ్లరు తన్ని డాన్సు నేర్పడాలు, బావి మింద డాన్సు – ఈ థ్రిల్స్ మధ్యమధ్యన. ఒకటే నస. జయప్రద మొగుడు ఒక నస. శరత్ బాబు ఒక నస.

కానీ కళాఖండం అట.

★★★★★★★★★★★★★★★★

"ఈ చరణం ఎలా అభినయించినావు?"

శైలజ అభినయించింది.

★★★★★★

పంచభూతాలు అంటే భూతాల్లాగా అనుకొనింది. కమల హాసన్ కు నచ్చలేదు. ఆమెను తిట్టాడు.

తప్పు శైలజది కాదు; ఆ పాటకు కొరియోగ్రఫీ చేసిన వాడిది కదా; వాడు పంచభూతాలను భూతాలుగా అనుకున్నాడు కాబట్టి అట్లా కొరియోగ్రఫీ చేసినాడు. వాడి అవగాహన తప్పు. శైలజ – భూతాలు అనుకునింది గనక, ఆ భూతాలకు తగినట్లు డాన్సు చేసింది. కొరియోగ్రఫీ సరిగ్గా చేయనందుకు ఈమెనెందుకు టంబ్లర్ ను తన్ని మరీ తిట్టాడు?

"నీ మనసంతా ప్రేక్షకుల మీదా, బుద్ధి అంతా వాళ్ళు కొట్టే చప్పట్ల మీదా, బిరుదుల మీదా ఉన్నాది" – కమల్.

ఈయప్పా అంతే కదా. యూత్ లో ఢిల్లీలో అదేదో ప్రోగ్రామ్ లో డాన్సాడి, పెద్దపెద్ద వాళ్ళను, మినిస్టర్లను మెప్పించి శాలువాలు, బిరుదుల కోసమే కదా అల్లాడింది? నిజంగా అంత ఆంబిషన్ లేకుంటే కేవలం డాన్స్ ను డాన్స్ కోసమే నేర్చుకుంటూ, ఏదో చిన్న

ఉద్యోగం చేసి తల్లి మీదా, ఫ్రెండు మీద బడి తినకుండా హాపీగా బతికుండవచ్చు కదా. పైగా తన డాన్స్ కు అందరూ చప్పట్లు కొట్టినట్లు జయప్రదతో పాటపాడి మరీ ఊహించుకున్నాడు.

"యతో హస్తః తతో దృష్టిః యతో దృష్టిః తతో మనః!

యతో మనః తతో భావః యతో భావః తతో రసః!! "

అని ఆయప్ప కోటించినాడు.

ఈయన దృష్టి ఎక్కడుంది? మద్యం మీద.

యతో "మద్యమ్" తతో దృష్టిః; యతో దృష్టిః తతో మనః!

యతో మనః తతో ఆస్వాదః; యతో ఆస్వాదః తతో రసః!!

కాదా?

★★★★★★★★★★★★★★★★★★★★★★★

సుత్తి –సమాప్తం

★★★★★(^_^)★★★★★